### దవానలభక్షణము.

ఉ॥ కాళియసర్పముం బాపిడిచి కంజదళాక్షుఁడు నిర్గమింప గో
పాలురు నందముఖ్యులును బందుగులుం గడుసంతసించి రా
పై లలిఁ గాఱుచిచ్చుఁ బొదువంగ ననంతుఁడు గ్రోలిలీలమైఁ
గేళి నిపంబునం దునిమెఁ గృష్ణుఁడు గాడ్పుబలెం బ్రలంబునిన్॥ 66

మ॥ నిలువుండీరముఁజొచ్చెఁజిచ్చుపసులన్ నిండారఁగా నైగలం
బిలువుండీరమరం గమంగొనఁ డిపీడం దొలంగించుమీ
చెలువుండీఱము గానుఖంతమని యాచిచ్చున్ వడిన్ మ్రింగి తా
నలభాండీరముఁ జేర్చె వారి హరి కవ్యాక్షిప్త డిండీరమున్
దళడిండీరము, కాననాబ్ధికి మధూద్యద్గండ పెండారమున్॥ 67

### గోపీవస్త్రాపహరణము.

సీ॥ పల్లెవల్లవులుల్లసిల్ల నల్లనిగొల్లపిల్ల పిల్లనగ్రోవి పెదవిఁజాదవి
మెల్ల మెల్లననూఁది యల్లిబిల్లిగనూది గొల్ల క్రేళ్లను బాఁదుకొల్పి మెలపి
త్రుళ్లి ప్రేల్లిగురింపఁ జల్లచల్లఁగ రాగ మల్లనల్లనఁ బాడుననుచుఁజనుచుఁ
దల్లిపిల్లనుఁదిల్లతల్లినొల్లకవిని గొల్లతల్లి మరులొల్కనుచు నను చు
నుల్లమునఁబొల్చనదినిల్చి ఘుల్లలొల్చి । మొల్లముగఁ బెట్టి సిరాజగొల్లగొట్టి
యుల్లసములాడి మెఱచి సిగ్గెల్లఁజెఱచి । పల్లవుండయ్యె రాధికావల్లభుండు॥ 68

### విప్రవనితాశాపవిమోచనము.

మ॥ పసులంగాచుచు నాఁకటంబడలి గోపశ్రేణినంపించి భూ
త్రిదశుల్ పొండన వారియాండ్రకడఁ గోరింపన్ సతుల్ భక్ష్య భో
జ్యసమేతంబుగ వచ్చియిచ్చిరటఁ బోషించి బిచ్చితచ్ఛాయల
వ్వసుధాదిత్యుల చేరఁబంచె హరి తత్పాపిర్జనత్రాపఘ్నుఁడై॥ 69

### విప్రవనితాశాపకారణము.

మ॥ ఇదియెట్లన్న నెఱుంగుఁడాంగిరసు లగ్నిచ్చన్ విమర్శింపకీ
ముదితల్ మోహితచిత్తరటన్న భ్రమచే ముఘ్న గ్రకాపంబొసం
గి పయన్నిక్కమెఱింగికృష్ణకృప ముక్తింగాంచిరిదాయలన్
మదతీర్థంబువహించి మమెత్తనయుండంచుంబల్కె వీరైరిటుల్॥ 70

### గోవర్ధనోద్ధరణము.

సీ॥ ఏఁటేఁటఁబచరించునింద్రయాగముమాని శైలేంద్రయాగనిశ్చయముపూని
గోవులకును భూమిదేవులకును దీనదేవులకును తృప్తిఁజేయఁబనిచి

గిరిరూపధారియైకృష్ణుండు నందాదులొసఁగినవరదపాయసము లెల్లఁ
దానారగింపఁబంతమున నింద్రుఁడు సప్తవాసరంబులు జాల్గవానగురియ
గోవులను గోపికల నెల్లగోపకులను । గావ గోవర్ధనం బెత్తి కదలకుండ
గొడుగుగాఁబట్టుటరసి శక్రుండు వేడ। నతనిరక్షించె సప్తమవాసరమున॥ 71

### ఇంద్రప్రార్థనాంగీకారము.

మ॥ వెరఁగై యింద్రుఁడు చిక్కి మ్రొక్కి సుతుఁడౌ విష్ణుచ్ఛపై వత్సల
త్వ రసం బాయక ప్రోవుమంచుఁబలుకం బ్రాణంబులఁ బాండవుల్
ధరయేలింతురు వారిచే రణములో ధాత్రీభరం బెల్లఁ దీ
ర్తు రహిం గంసముఖాదులందునిమి తోడ్తో నంచు గృష్ణుండనెన్॥ 72

### సర్వలోకప్రదర్శనాదిప్రశంస.

చ॥ వ్రతమొనరింప నందుఁడొకవాసరమందసురార్థవేళ నా
ప్లుతుఁడగుచుండఁగా వరుణలోకముఁ జేర్చిరి తద్భటుల్ మహా
ద్భుతముగఁ గృష్ణుఁ డేఁగి పితఁ దోడ్కొని రా వెఱఁగంది రంద ర
చ్యుతుఁడు నసర్వలోకములఁ జూపెఁ దదర్థనసార్థకంబుగన్॥ 73

### సాయంకాలాద్యభివర్ణనము.

ఉ॥ అంత దినాంతమయ్యె హరిదంతరదంతురకాంతిశాఖి శా
ఖాంతర నంతరాయతనిజాయత నాపతనాత్మనాద్యమా
ద్భ్రాంతశకుంతమంతికదురంత వియోగభయాకలిత
స్వాంతనితాంతతాంతమదనాకలనాకుల కోకకాంతమై॥ 74
* మ॥ అపరాద్రీభవిభుండు రాకతలకిన్ ఛాయానక్రసంగ్రస్తదే
హాపరార్థుండగుచున్ విశావలయుతుఁడౌ టాలించి మేల్కొంచి కా
లపయోజాక్షుఁడు లీలఁదద్గ్రహముదూలన్ సూర్యచక్రంబువై
చి పడంగొట్టెంగఁజిమ్ము రక్తమనమించెన్ సాంధ్యరాగంబుగన్॥ 75
క॥ ఇనశశులిరు మొగములు ... ఘనమగ లలిగరిణి కిరణజాలమువాలై
తనరెడు రోదసిమద్దెల। యనఁదగె ఖగరుతములు గోమగ్నదిగాధుగదా॥ 76

### చంద్రోదయవర్ణనము.

క॥ ఉదయాచలవల్లీ ... భ్యుదితసమయభోగిభోగ మోయఁ ఇంద్రుం
డు దనశ్చేదతక్కళంకము। మృదుతుచిలుగు కృష్ణపాదమే కాదుగదా॥ 77

---

* పద్యాంతరము॥ క॥ అపరగిరికరితనువనా। తపసుకరిగ్రహించు కుటిలగతితోయమాహరియుం
దపన సుదర్శనమునఁదఁ। ద్రిపుఁగ్రమతలఁగఁగ్రమ్ముకనెత్తురేసంబగదా॥

క॥ చదలఁ బడు యమునమడువునఁ । బొదలు సమయ కాళియాహిభోగఫలకము
ట్లుదితశశిబింబములకెం । దదంకము యదూద్వహునిపదము గాదుగదా॥ 78

క॥ మిన్నని యెడి మున్నీటన్ । భిన్నంబగు శుక్తికరణిఁ బెంపెసలారెన్
వెన్నెలదొర తారకలు స । మున్నతిఁ బైఁబడిన ముత్యములు గావుగదా॥ 79

సీ॥ అలశరద్రాత్రియందలరుచుఁ గృష్ణుండు మురళి వాయింపఁగా మదితలెల్లఁ
దమపనుల్ విడిచి తత్సన్నిధికేగి రారాని సతులు తత్ప్రవణచిత్త
లైమ ముక్తిఁ గనిరన్న యన్న మిన్నలఁగని వెన్నుఁడెన్నెన్ని హావిధులు దెల్పి
పొమ్మన్నఁ బోకున్న మురిసి కన్పడకున్న వెదకియుఁ గనలేక విసికి కొసకు
తనత్రయత్కఁ గాంచి జనాత్తచితచ్చరితలు । దామె యొనరించి మధురగీతముల బాడ
దఱుఁగలిఁగి తోఁచి బ్రతిమాలి దానవారి । దాను వారి రాసక్రీడఁ దనిసి తనిపె॥ 80

సరోవరవర్ణనము.

మ॥ పరిపరి కేళికాళియను పల్లెరమం దరమోద్భుతమిత్రకీ
ల్బరిణలఁ గ్రమ్ముతు మెత్తని కోలముల్ల పేరిటి వేల్పుటాలఁ గొ
ల్చురహివహించి గట్టుపయిఁ జుట్టునుఁ బుట్టిన ప్రాతలాసలున్
విరులును బువ్వుఁ దేనియలు వెండియుఁ బండులు రాల్చు మెండుగన్॥

ఉ॥ తమ్ముల గుంపునందలి యతమ్ముల పెంపున శీతవాతపో
తమ్ముల పంపున సత్రధుష్కృతమ్ముల నింపు ననంగునంప మొ
త్తమ్ముల సొంపున స్పృహుగతమ్ముల ముంపున నీదు హంసజా
తమ్ముల తెంపునం బలుకతమ్ముల నింపు నయించుఁ గాఢ్మికన్॥

సీ॥ జిగినాఁచు దీఁగలు చిగురుదర్భలు గాఁగ నలిననాళములింధనములు గాఁగ
ఫుల్లరక్తాంబుజంబులు నిప్పుకలు గాఁగ ఘనకేసరంబు లక్షతలు గాఁగ
మధుగసపూరంబు మధురాజ్యధారగా మధుకరరాజి ధూమంబు గాఁగఁ
దీరభూజములు బుత్విగ్జనంబులు గాఁగఁ దక్షగధ్వనులు మంత్రములు గాఁగఁ
దమిత్ర మొగ్గలుబలుయూపదారువులుగ । మనత్రథాధ్వరిగా మించు మానినీజ
నాతిమానాశ్వమేధమహాధ్వరంబు । నెలవనుతలంపు నింపు నళీకులనిసొంపు॥ 83

క॥ క్రమవ[illegible]రత్నరేఖో । ద్గమసంపల కంకణోదితుల శ్రీకరమై
కమలాకరమొప్పునదౌ । త్కమలాకరమొప్పు విమలకమలాకరమై॥ 84

చ॥ భువనధురీణతాయుతనభోగనుతస్థితియై కవీడ్యశ
బ్దవివృతిసౌష్ఠవాకలనభాసిలి దృక్ప్రతిభావభావ్యమై
సువిశదమై రసాతలముశోభిలఁజేయుచుఁబదత్రిలోచనా
నవరతశయ్యనా నది యనంతవిలాసముఁజూపు నెంతయున్॥ 85

సీ॥ సమ్యక్ప్రసాదవత్సరసభావంబున ఘనమధుపాటనాకలనవలనఁ
బ్రబలగాంభీర్యధారంధర్యసంగతి మహనీయభువనసంభరణగరిమ
మత్స్యకూర్మాదిసంభవహేతుకస్థితిఁ గువలయవిలసనాకుంఠమహిమ
సంతాపమునడంచుచల్లఁదనంబున నాశ్రితసులభమై యమృతమిడుట
దౌత్యమువహించియును సుదంచితద్విరేఫ । శబ్దలక్ష్మోత్రిద్యదమితాబ్జసముదయాస్ప
దత్వగౌరవమున మీఱుదానవారి । మానసమునేమనఁగవచ్చు దానిసొబగు॥ 86

చ॥ అరుణకరోత్కరారుణ సుమాంచల చంచల చంచరీక సం
చరణసమంచితామ్రతరు సంచయముల్ జలబింబితంబులై
పరఁగుఁదదీయతీరమున వహ్నికిఁగంటి ముపర్యధోముఖ
స్ఫురణమునేఁటికిందనుచుఁ జూపరులబ్బురమందిచూడఁగన్॥ 87

ఉ॥ మీఁదుగఁబాదముల్ వఱపి మేదిని నొదలలూఁది మాధవై
కోదయ పాదరాత్రిక వనోదరమందు జపించువారిగా
నాదరినున్నయున్నతనురాగములం గమలాకరప్రస
న్నోదకమందుఁజూచి చెలియొక్కతె మ్రొక్కఁగ నవ్విరందఱున్॥ 88

జలక్రీడాదిప్రశంస.

శా॥ రాసక్రీడలఁజేసెలందనిపి యా రాజీవనేత్రుండు పే
రాసన్ వారివిహారముల్ సలిపి నిర్యచ్చంద్రికాసాంద్రధా
రాసంపాతసుశీతసైకతములన్ రాజాస్యలంగూడి యా
రాసంభోగమొనర్చె నస్ఖలితుఁడై ప్రత్యేకరూపంబులన్॥ 89

గోపీసంశయవిచ్ఛేదము.

సీ॥ తత్త్వజ్ఞులస్ఖలితబ్రహ్మచారిగా నిచ్చకంబాడుదు రింతకాని
యిందఱితోఁగృష్ణుఁడిట్లురమింపుచు నస్ఖలితుండెట్లుకానటంచు
నగుమగువలకెల్ల నమిత్రకపుట్టుట శోకరేయిదుర్వాసుఁడుగ్రుఁడగుచు
నాకొంటినన్నముల్ దేమన్నశపియింతునని యమునాపారమందుమెఱయ
యమునదాఁటి రాఁగ నసమర్థులైవారు । వన్నినట్లుచేసి యన్నములిడ
కృష్ణుఁడస్ఖలితుఁడు ఋషిశశ్వదుపవాసి । యనుచునమిత్రవేఁడుకొనిరివారి॥ 90

## గంధర్వ శాపవిమోచనము.

మ॥ నగమునన్నాంగిరసుల్ గురూపులని గంధర్వుండు వారల్ శపిం
పఁగఁ బామై యిటనందు మ్రింగె హరియొంపన్ దొంటి రూపంబుతో
గగనంబంటి సుదర్శనుండను భవత్కారుణ్య సంపత్తిచేఁ
దగె శాపచ్యుతుఁడంచు మ్రొక్కుచని యొక్కన్ దేదీప్యమానాకృతిన్ ॥ 91

## శంఖచూడచూడామణి హరణము.

చ॥ కొనకొని శంఖచూడుఁడను గుహ్యకుఁ డొక్కవిలాసవేళ న
ల్లనచని వల్లవీజనములం గొని పాఱఁగ శౌరి సీరితో
వెనుచని చీరి వారి విడిపించుచు వాని వధించి తన్మణిం
గొని చనుదెంచి యిచ్చె నిట గోపికలం గని కాచు సీరికిన్ ॥ 92

## కపిద్ధాసుర (కాలకవికుల) సంహారము.

సీ॥ బలియన్న యగు కాలకవి యసురక్కసి వెక్కసముగనిక్కి వెలఁగయగుచు
వెలిఁగె నచ్చలియుని బలగముకఁటక తరువులై పెరివె నాతని సహస్ర
సుతవతులగు సప్తసుతులు గోమూర్తులై ఘటతుల్య తత్ఫలచ్ఛటలఁదినుచు
బలిసిరిందఱును దత్ఫలవిషవాతంబు లాభీర గోనివహార్తిఁజేయ
శంభుఁగొల్చి తత్ప్రేషితశంఖకర్ణ । భూతపరవశ విధివాక్యముల నెఱింగి
సీరితో శౌరి చని వారిఁ జీల్చి కాల్చి । మని చెగోగోపకుల నిరామయులఁ జేసె ॥ 93

## వృషభాసుర సంహారము.

మ॥ వృషభంబౌచు నరిష్టనేమియను దైత్యేంద్రుండు దీంద్రించి గో
వృషముల్ గొందలమంద మందపయిఁ బర్వెం బర్వఁ బర్వేంద్రుఁడు
నిశితధ్వాంతము నట్లువంచె నవుడానీరేజనేత్రుండు త
ద్విషమాకార విషాణమూడ్చి యదియే దివ్యాస్త్రమై తోడ్పడన్ ॥ 94

## కేశి సంహారము.

క॥ శైశవమునఁ గేశవుఁడ । క్లేశంబున నీసడించి కేశియనెడు నా
కేశవిరోధి నడఁచిలో । కేశవినుతిఁ గాంచె వశమయిడి శిశువులకున్ ॥ 95

## కేశి ప్రలంబ వత్స బకాసురుల పూర్వవృత్తాంతము.

సీ॥ గంధమాదనమున గంధవాహాఖ్య గంధర్వతపస్వికి నందనులయి
తగు సుదర్శన సుహోత్ర సుదేవులును సుపార్శ్వుఁడును దుర్వాస శిష్యులయి
యోగబలమున రాధేశపార్శ్వతులై పదత్రపూజనిత్యవ్రతంబుగఁ దదర్థ
మమర్త్యులనికిఁబోయి కమలముల్ గోయుచు శివపృష్టులై తమ చెయ్దిఁ దెల్పఁ
[illegible] శివుని యాన । దప్పదవి కృష్ణుడై వారితలఁ [illegible]
[illegible] కేశి ప్రలంబ । వత్సబకదైత్యులై ముక్తిఁ బడసిరిపుడు ॥ 96

## వ్యోమాసుర సంహారము.

మ॥ ఇటులశ్వంబగుకేశిం ద్రుంచి యటుపైఁగృష్ణుండు గోపాళితో
నటవిన్ డాఁగిలిమూఁతలాడు నెడ వ్యోమాఖ్యాసురుండర్భకుం
డటులై యాటమిషన్ గభీరగుహలో నాభీరులన్ దాప న
క్కుటిలుం ద్రుంచి గుహాగతార్భకుల దోడ్కొంచుం జనెన్ మందకున్ ॥ 97

## మాతులాహ్వానము.

సీ॥ వినుఁడు నారదుఁడు కంసునకుఁ గృష్ణప్రశంసయును గృష్ణునకుఁ గంసప్రశంస
యును దెల్పవినికంసుఁ డుగ్రుఁడై వసుదేవు నఱకరా వారించె నారదుండు
పిమ్మట నక్రూరుఁ బిలిచి పిమ్మటల చందము లెల్లఁ జెప్పి బృందావనమున
కిప్పుడనీ వేగి యుపాయనంబులఁ గొని రామకృష్ణుల ధనుర్యాగమునకుఁ
దోడుకొనిరమ్మిక నతండు గూడదనుచు। నెంత చెప్పిన వినకున్న నీశ్వరాజ్ఞఁ
ద్రోయరాదని యెఱిఁగి యక్రూరుఁడరిగి। రమ్మనఁగఁ బోయె నా చరిత్రముల వినుఁడు

## దివ్యరూప ప్రదర్శనము.

మ॥ యమునం దాఁటి రథాధిరూఢులయి వారక్రూరు నీక్షింపఁ దో
యమునం గ్రుంగుచు నీటఁ బైటనొక చాయం గాంచె శ్రీకృష్ణ కా
యమునంతన్ భ్రమదీరమున్గి యతఁడయ్యం బాపరాశయ్య నా
య్యమునన్ వర్తిఖమూర్తిఁ గన్గొను వెరంగై మ్రొక్కి ధ్యానింపుచున్ ॥ 99

సీ॥ మలనూని విలువోని నలుపూని చెలువారు పులిగోరు తీరు కన్బొమలవాని
తొలిగుండు తలనుండు నలనిండు వెలమించుఁ గిరీటంబు తెలిబొమిడికమువాని
కటితాల సరిగాలు నెటిచాలు నెటిచాలు గదిరెడు కుదురైన నుదురువాని
కొలుగాని మెఱుఁగాని నెఱితూనికంబుల నందమౌ చెంబౌజుబందువాని
తెలివాలు మాలేని మానికంబుల జగానీ। గార మొగిఁగేరి జగిదేరి మీఱు నాసవల
వడకువిడని వ్వాటిల్లు మవ్వంపుదివ్య। చొక్కమొక చక్కఁ జేర్పు చేర్పక్కవాని ॥ 100

## దివ్యరూప వర్ణనము.

సీ॥ అంగదఘంగదలంగదలంకించు చౌలంగదముల నాసంగువాని
మురిపెంపు సిరిపెంపు నరహింపు రతనంపు పేరు పేఱురమున మీఱువాని
మురుగుల్ మెఱుంగుటుంగరములుంగరములంగరమలంకృతులుగాఁ గలుగువానిఁ
జెన్నె మించులను మించు పికిలిపించెపుఁ గుచ్చు వ్రేలాడు మొలత్రాడు వెలయువాని
తళుకుమగడాలుఁ దొగడాలుఁ దమ్మిడాలుఁ। బల్లుదొరడాలుఁ గలిడాలుఁ బ్రొద్దు
[డాలుఁ
దాయొరలచాలు నెలడాలుఁ దలుపుడాలుఁ గలుఁగుమేల్కుందనపుటందెల
[లతనివాని॥ 101

సీ॥ అలసంపఁగుల జొంపముల పెంపడఁగ నొంపఁగల సొంపుగల నాస గలుఁగువానిఁ
గురువిందములఁ గెంపుటరవిందములఁ బెంపుఁదొలఁగించు మోవినవ్వాలయువానిఁ
గ్రమవృత్తసమ చిత్తజమహాత్తరనిషంగ కమనీయ జంఘాయుగంబువాని
వెలిదమ్ముల మదమ్ము వెలిజిమ్ము చెలువమ్ము గలనిడువాలుకన్నొచలవాని
నిడుభుజంబులవాని నుందొడలవాని । నొగులడఁచువాని గూఢజానువులవాని
మేలిజెడువానిచక్కని మేనువాని । శ్రీరమాజానినపుడు దర్శించివచ్చి॥ 102

చ॥ నునువిను చూలిమేఁత పయినూలొక్కని సిబ్బెపులిబ్బి ప్రబ్బుబో
టి సెరులు మేలిత్రటూరపు కడిందియనుంగున గొప్పనొప్పఁ దా
లనశానగోటఁ జిక్కవెడలింపు చునింపుగఁ బాలవెల్లిమం
దు సెగడుచున్న నిన్నుఁదలఁతున్ మురమర్దన శ్రీజనార్దనా॥ 103

ఉ॥ ఈనదిలో మునింగి భవదీక్షణతృప్తుఁడనై భజించితిన్
మానసికార్చనార్పితసుమంబులె నీపయినుంటఁ గంటి ని
క్లైనిపుడీ వెఱుంగనటు లేమిగ నంబడెనీట నంటివో
దీనశరణ్య కృష్ణ భవదీయమహాత్త్వ మెఱుఁగ శక్యమే॥ 104

శా॥ దేవా కృష్ణుఁడు వాసుదేవుఁడని మూర్తిస్ఫూర్తి లీక్షించి యీ
జీవుల్ గొల్లడవంద్రుగాని నిజమీక్షింపన్ జగత్కుక్షివే
కావే కావవె భావవేశత్రమున నీకల్యాణరూపంబు స
ర్వావస్థావసరంబులన్నిలిపి మాయంబాయఁగాఁ జేయవే॥ 105

## అమూర స్తవము.

శ్రీకంఠుండే సేవ్యుండంచుం జెప్పన్ వేదశ్రేణుల్ దొల్తన్
వైకుంఠుండే వంద్యుండంచుం వాదించుందర్వాతన్ దామే
యేకాకారంబే బ్రహ్మంబౌ నీమూర్తుల్ దానేయౌనంచున్
నాకుందోఁచున్ నామాకారానందార్థం బీన్యాయంబౌటన్॥ 106

సీ॥ అనుదినమును నినుమనమునఁగనుఁగొను మనుజుని వెనుకొని మనుతువనుచు
వినునెడఁ గనునెడఁ జనునెడఁ దినునెడ నను నెడ ననువిడ కెనయుమనుచుఁ
దెలిసియుఁ దెలియక సలిపిన కలుషములయూతములయినను సయిపుమనుచుఁ
బనుల కొలఁది పలుతనువుల నొసఁగిన నలయక తలఁపున మెలఁగుమనుచు
బహుళసుఖముల నిహమునఁ బరమపదము చరమగతినిడుమని నిను గరిమఁ గొలుతుఁ
గరముఁ గనికరమున మదిగరుగ నభయకరము శిరమున నిడుమిక పరమపురుష॥ 107

ఆ॥ ఇలయు జలమనలమును చలి నెలవు గగనమన గలసకలజగములనుదలఁపున నెసల్పన్
నిలుపఁ బురికొలుపఁ దరిఁ గలపమతియితరులకుఁ బలుమఱునుగనఁబడక ఫలముల [నొసంగన్॥
బలుదిగులయు భవతరణములనవిఁగనఁబడియు లల్లిఁదెలియఁబడనిమహిమలను దెలు [వొందన్॥

దోలుబలుకుకొనలఁగన సులభముగఁగనఁబడఁగ వలతివయి వెలయునినుఁగొలుతుఁ [బరమాత్మా॥ 108

ల॥ జననియును జనకుఁడును తనయులును సహజులును ధనము పరి జనము గురు జనము [మతిసేవే
యను మమతఁగను చనిను వినుచునను మను చుమని వినయమున నయమునను మనవి [యొనరింతున్
వినతులయి వినుతులను ననుదనుపున నదలను మనుతునను దినను నెడు ఘనమగు [ప్రతిజ్ఞన్
గనికరముగ నికరము మనమునను బెనఁగొనఁగఁ గనుఁగొను మునను గొను ము వినుము [పరమాత్మా॥ 109

మ॥ సురపతియు శుచియముఁడు నిరృతియును వరుణుఁడును గరువలియు ధనదుఁడును [హరుఁడును మొదల్గాఁ
బరఁగు సురవరులయినఁ గరము భవదఖిలగుణ గరిమలవమయినఁ దెలి యరని శ్రుతి [పల్కన్
గరము దరభరణ మొక పరమగతి యను చు భవశరధిఁ బడి మునుఁగుచును దరిగనక నానా
దురితములఁ నిరతమును జరితములఁ గనఁబడెడు నరులకది దెలియుటకుఁ [దరమె పరమాత్మా॥ 110

ఉ॥ ఆండజయాన కుండలిశయాన భయానకభండనారి రా
క్షండన యక్ష్వాకాండ నవ కౌస్తుభమండన రక్షితాశ్రితా
ఖండల గండలంబి శశిఖండ లసన్మణికుండలా ప్రస
న్నాండవుగముత్త చక్రధరనూత్న విభాస్వ రవీందుమండలా॥ 111

ఉ॥ తావకసేవకావళికిఁ దద్దయు నెద్దియు నైన భావుకా
భావము గల్గునే వివిధభావములం గన నీదుపాదరా
జీవము లాశ్రయించె నిజచిత్తము గావున నిబ్బయంబు వే
వే విదళించి కావఁగదవే యువినశ్వర భార్గవీశ్వరా॥ 112

క॥ అని యాగతివినతుండై । వినుతింపుచు మధురఁ జేరి వెన్నుని దనతోఁ
దనయింటికిప్పుడేర । మ్మనఁగం జని మొత్తి వత్తుమని పుత్తెంచెన్॥ 113

రజకసంహారము.

ఉ॥ అంతట నాంతమయ్యె నరకాంతకుఁడుం బురకాంతలెంతయున్
వింతగఁజూచి సంతసిల విప్రులు మెప్పలఁ బూని గాసంగ న
ప్పొంత నె వచ్చుచున్ రజకుఁ బుట్టములిమ్మన నీమి నా మిషన్
గొంతుక నొక్కి త్రొక్కి తమకుందగు బట్టలు గట్టఁ గైకొనెన్॥ 114

కువింద రక్షణము.

క॥ ముందట యెదురై యొక్క కువిందుఁడు ముకుళితకరారవిందుఁడగుచు గో
విందునకు మేనివలువలఁ । గుందనపుంబొడవులిచ్చి కొనె నీప్సితముల్॥ 115

సుదామసంరక్షణము.

క॥ దామోదరసన్నిధిలోఁ । దామోదరసంబునన్ సుదాముఁడు సుమనో
దామమ్ముత్రలనిడికృష్ణుస । దా మముత్రలఁ బ్రోవుమనఁగ దయనవిగొనియెన్॥

కుబ్జావనము.

క॥ ముయ్యాటుదీపులం దన । యొయ్యారపునడలఁ గెలువనోపు నయారే
యియ్యగనాశిరోమణి । తియ్యని విలుకానిజుఁట్రతీకాదుగదా॥ 117

గీ॥ అనుచుఁ జయ్యనఁ బౌరులయ్యంగనం గ । నుంగొనియభంగకౌతుకరంగదంత
రంగులై భక్తినుప్పొంగిమంగళకర । వచనరచనలఁ బొగడునట్లచిరముగను॥ 118

మ॥ అనులేపంబులుగోరికైకొని త్రివక్రాకారయౌ కుబ్జనా
క్కృనిమేషంబునఁ జక్కనైనవనితం గావింపఁగా విశ్వమో
హనమూర్తిం దనుఁగాంచి పంచశరవీరార్తిన్ నివర్తింపఁజే
సి ననుం బ్రోవుమటన్న వత్తునని యే చేరెన్ ధనుశ్శాలకున్॥ 119

కంసకార్ముకఖండనము.

ఉ॥ చేరి గజారికార్ముకముఁ శ్రీరఘురాముఁడు చీరుతీరునన్
శౌరి నిజారికార్ముకముఁ జయ్యన ద్రయ్యలుజేసి తానునా
సీరియుఁ రెండుఖండములు చేకొని దండ్యులఁ జెండి వల్లవా
గారమునందుభోజనసుఖస్వపనంబులుదీర్చి వేకువన్॥ 120

సూర్యోదయవర్ణనము.

మ॥ తొలిడాల్కట్టెయుఁబట్టి తూర్పుచెలి కందున్నట్లటా కానఁగా
నెలపా నేర్పులబుట్టిగాఁ గొనిన పెన్నేచెంచితన్ మిఁటియుం
దలిపొద్దుం దొడవూడ్చు చొప్పడుగఁ జెంతం దండ్రి నేరంబెఱిం
గిలి లల్ఁజీఁకటి సంజకుత్తుగమిడాఁగెం గానలం దెల్లెడన్॥ 121

కంససంహారము.

మ॥ బకవిద్వేషి ప్రభాతకృత్యముల నిర్వర్తించి కంసదుర్రిపుం
బెకలింపం జన నడ్డమై కువలయాపీడంబు పీడింప నో
డక బల్వేఁడుక తోడఁబోరి శిరమూడంగొట్టి చాణూరము
ష్టికులం జంపి నృశంసుఁ గంసుఁ దునిమెన్ శీర్షప్రహారంబులన్॥ 122

కంసజన్మకారణప్రశంస.

సీ॥ ఒకఋతుకాలమందుగ్రసేనునిరాణి యామునతటిని సుయామునతటి
నిష్టవిహారసంతుష్టయై చెలులతో మెలఁగుచుఁ దొల్కరి మెఱపుటొఱపు

నరసి రతిచ్ఛచే నాత్రేత్రి శుమడిఁగోరఁ గాలనేమియుఁ దదాకారమూని
వచ్చిరమింపఁగా నచ్చెరువయిచూచి కలయికలో భర్త గామిఁ దెలిసి
తనసతీత్వముఁ జెఱచినదనుజుఁ దెగడి । కంసుఁ దనుజాగఁ బడసి తత్ఖలవినాశ
కరుఁ డుదనకులమునఁ బుట్టుఁగాకటంచుఁ । గోరె నాతండె కృష్ణుఁడై కూల్చెనిట్లు॥

జననీజనకసంభావనాదిప్రశంస.

మ॥ కుసుమంబుల్ గురిపించి రత్తఱి సురల్ గోవిందుఁడుం దేవకిన్
వసుదేవుం విడిపించి వేడుకొని యాపై నుగ్రసేనాఖ్యుఁ ద
ద్వసుధం బ్రోవఁగ బంచి పిమ్మట యశోదానందులం గొంత సం
తసిలం జేయుచు వీడుకొల్పి నిలిపెన్ రావించి భోజాదులన్॥ 124

ఉపనయనమహోత్సవము.

చ॥ మహితముహూర్తమందు మహిమప్రతిభర్గుఁడు గర్గుఁ డొజ్జగా
రహి నుపనీతులై చనిరి రాముఁడుఁ గృష్ణుడుఁ దొంటికన్న వి
గ్రహములు బ్రహ్మతేజమునఁ గన్నులకున్ మిఱుమిట్లు గొల్పఁగా
నహహ రవింబులో, పటికనార్చిన బంగరుబొమ్మలో, యనన్॥ 125

విద్యాభ్యాసము.

సీ॥ ఏపీటనివసించి యెల్లజీవులకు విశ్వేశ్వరుండు విముక్తినిచ్చుచుండు
నేపీటబ్రహ్మాది దేవతలు ఋషులు యోగులును మోక్షార్థులై నిలిచియుందు
రేపీటమంత్రియై యిందిరాపతి క్షేత్రపాలుఁడై భైరవుం డేలుచుండు
నేపీటనారసి నానావిశ్వపావని గంగాతరంగిణి పొంగిపారలు
నట్టిమహిమాంబురాశియైనట్టి కాశి । కరిగి విజ్ఞానసందీప్తుఁడైతనరుచు
నట్టిసాందీపువలన విద్యలు గ్రహించి । పుత్త్రదక్షిణ యిచ్చుటచిత్త్రమయ్యె॥

గురుదక్షిణాప్రదానప్రశంస.

ఉ॥ నైపుణిఁ జూపి యొక్కొక దినంబున నొక్కొక విద్య గాఁగ ని
ష్ఠేఁపున విద్యలన్నియు గ్రహించి రహించుట క్రమమందిసాం
దీపుఁడు నందనందనులఁ జేరగనుంగొన వారుఁ గోరుమో
తాపసవర్య యార్యగురుదక్షిణ యంచుఁ దదీప్సితజ్ఞులై॥ 127

మ॥ ఒకనాఁ డబ్ధి ప్రభాసతీర్థమున మునుఁ గత్రజ్జితుండై తద
ర్భకుఁ డంతర్హితుఁడౌ టెఱింగి శరధిం బ్రార్థించి తత్సూక్తిను
క్తి కటుం బంచజను న్వధించుచుఁ దదస్థిన్ బూరగాఁ గొంచు నం
తకు జంకించి తదర్పిత ప్రసవదాన ప్రీణితాచార్యులై॥ 128

### మథురాపురప్రవేశము. కుబ్జామనోరథపూరణము.

మ॥ తదనుజ్ఞంగొనివచ్చుచున్ మధురచెంతం బాంచజన్యస్వనం
బొదవింపందమరాకఁగాఁదలఁచి స్త్రీయుక్ నయ్యుగంద్రుప్తినం
దదృగానంద మొసఁగ్చు కృష్ణుఁడు యశోదానంద గోపీహృ
ష్టదయుం దెల్పఁగ నుద్ధవుంబనిచి కుబ్జావాంఛఁదీర్చెందమిన్॥ 129

### శృగాలసంహారము.

మ॥ జలజాక్షక్షతుఁడై తొలంగిన జరాసంధున్ విసర్జించి సే
నలతోడన్ దమఘోషుఁడచ్యుతుని చెంతంజేరి ప్రేరేఁపఁగా
హలితోనేఁగి శృగాలుఁగూలిచి తదీయ స్త్రీలు ప్రార్థింపఁగా
నిలిపెందత్కరవీరపట్టణమునన్ వెన్నుండు తన్నందనున్॥ 130

### జరాసంధయుద్ధము.

సీ॥ పితృవియోగమున దుఃఖితులైరి పాండవుల్ ధృతరాష్ట్రవిభుఁడంధుఁడతనితనయుఁ
డతిమదాంధుఁడు కుంతి సుతులెట్టులై యుండిరో యని కనుటకక్రూరుఁ బనిచి
జిగిమిషుండై యుండ జగమిషువులఁ జెండఁదగినంత సేనతో మగధనేత
దనకుఁ బుత్రికలు కంసునకుఁ బత్నులైనయస్తియుఁ బ్రాప్తియుఁగస్తి వడఁగ
మిట్టిపడి మధురాపురిముట్టడింప । రామకృష్ణులు వారియిర్వదియు మూఁడు
సైన్యయక్షోహిణులఁగొట్టి వానిఁబట్టి । యనువిడిచిపెట్టి రామీఁది పనులఁబట్టి॥

### కాలయవనహననము.

సీ॥ మఱియు జరాసంధుఁ డెటులేఁగి యొటులఁగియుఁ బదునేడుసారులీపగిదిఁ జాఱి
పదునెనిమిదవసారి బయలుదేరుటకు సన్నద్ధుఁడౌనంతలో నారదుండు
హరిపల్కులఁ దెల్పి ప్రేరిఁకొల్పఁగా దర్పమునఁ గాలయవనుండు మూఁడుకోట్ల
యవనసైనికులతో నవనియానినచందమున మధురాపురిముట్టడింపఁ
గృష్ణుఁడఖిలజ్ఞుఁడగుట చేఁ ధృష్టుఁడైన । రాయుధుండయి రాఁగనియతఁడు దఱుమ
హరియుగిరిగుహఁజొరఁగ వాఁడరిగిహరిగఁ । దలఁచియందున్న ముచికుందుఁ దన్నిచచ్చె॥

### కాలయవనజన్మవృత్తాంతము.

సీ॥ యాదవుల్ దమకొజ్జనగునన్న నస్యుఁడు పరిహసించియతండు పడఁతిగాక
పురుషుఁడేయనితమమొప్పలఁ బ్రేలఁగమించు మిన్నకుండిరటంచు మిగులఁ బొగిలి
యదుకులభీకరుండగు సుతుఁగోరి పండ్రెండేఁడులు కుప్పిండిఁ దినుచుండి
ఘనతపమొనరింపఁగరుణించి భర్గుఁడు గర్గుండడిగినట్లుకలుగునన(ఁగ)
నాతఁడచ్చరయందుఁగన్నట్టి సుతుని । యవనపతి పెంచితనరాజ్యమవల నొసఁగ
నాతఁడే కాలయవనుఁడౌనని ముకుందుఁ । డెంచి ముచికుందుచేతమ్రందించెనిట్లు॥

## వాసుదేవప్రభావప్రశంస.

చ॥ హరిగరిమంబెఱుంగ దరమా పరమాత్ముఁడతండు నేఁడు భూ
భరము హరింపఁ గృష్ణుఁడయి భక్తులఁ బ్రోచుచుఁ బాపయుక్తులం
బొరిఁగొనుచున్నవాఁడు వెఱపుల్ మఱపుల్ గలవాఁడుగాడు భం
గురమతులెట్టులన్న ముచికుందరిరక్షకొనర్చెనీక్రియన్॥ 134

## ముచికుందచరిత్రము.

సీ॥ ముచికుందునిచరిత్రము వినుఁడతండు మాంధాతృపుత్త్రుఁడు దేవతాహితార్థి
వాసవప్రార్థితుండై సమరములందు నసురులనుజయంబునమరఁ జేసి
సురలు ప్రసన్నులై వరమీఁదలఁచినఁ దనవాంఛ లేమి నిద్రను వరించి
లేపినవానిఁ గాల్చెద నంచుఁ బవ్వళించె హరియెఱుంగును గానన తనినిపుడు
మేలుకొల్పుటకీరీతిఁ గేలుఁగొల్పి। స్వాజ్ఞచే విశ్వకర్తయునబ్ధిమధ్య
మునసృజించిన ద్వారకాపురికిఁ జేర్చె। యోగమహిమను మధురలోనున్న జనుల॥
క॥ వీక్షించుచు ముచికుందుఁడు। పేక్షింపక మోక్షసుఖ నపేక్షింపఁ గృపన్
రక్షింపనున్న జలజా। క్షునిటుల్ బొగడఁ దొడఁగెనతఁ డానతుఁడై॥ 136

## ముచికుందస్తవము. బాలకృష్ణస్తవము.

శా॥ శ్రీనందప్రియనందనుండవగుచున్ వ్రేపల్లెలోఁ బుట్టి నీ
వానందప్రియమూర్తివై తివిఁక నీయాకారమే కారణం
బైన నూత్నముఁ జేసి కన్పఱచి నన్నానందమొందింపుమీ
నానామంగళసంఘసంఘటన తృష్ణా బాలకృష్ణా హరీ॥ 137
శా॥ నేనీవాఁడనటంటి వేఁడుకొనుచుంటిం బ్రోవుచుంటిం గృపన్
నానేరంబులు సైపుమంటి భవసంతానంబు నేనోర్వఁగా
లేనంటిన్ నినువంటివేల్పులెవరున్ లేరంటి రక్షింపుమీ
నానామంగళసంఘసంఘటన తృష్ణా బాలకృష్ణా హరీ॥ 138
శా॥ నేనేకార్యముఁ జేయఁజాలనది నీనిత్యార్చఁగాఁ జూచి నా
దీనత్వంబెడఁ బ్రోచి కేవల కృపాదేదీప్యమానుండవై
హానిం జెందఁగనీక యేమరక నిత్యానందమొందింపుమీ
నానామంగళసంఘసంఘటన తృష్ణా బాలకృష్ణా హరీ॥ 139
శా॥ జ్ఞానంబించుకయైన లేనికతనన్ సంసారసౌఖ్యంబులన్
మానంజాలఁగనైతి నట్టులయినన్ మత్పూర్వపుణ్యంబునన్
నీనామస్మరణంబు గల్గెనిఁక దానిన్ నిల్పి రక్షింపుమీ
నానామంగళసంఘసంఘటన తృష్ణా బాలకృష్ణా హరీ॥ 140

శా॥ నీ నాభీకమలంబునం బొడమి వాణీభర్త నీతత్త్వ మిం
తైనం గన్గొనఁజాలఁ డయ్యె ననఁగా నస్మాదృశాత్యంతమూ
ఢానీకంబు గనుంగొనంగలదె ప్రత్యక్షంబవై యేలుమీ
నానామంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 141

శా॥ సూనుం డెంతటి నేరపోతయిన సంక్షోభంబు లేకుండుచుం
దానం దండ్రి సహించి ప్రోచుకరణిన్ నా నేరముల్ సైచి నీ
యానం ద్రిప్పి యొసంగు మైహికసుఖం బాముష్మికానందమున్
నానామంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 142

శా॥ విశ్వం బంతయు నీవుగాఁ గనుచు నిన్విశ్వాత్ము సేవించువా
రైశ్వర్యం బిహమందు నొంది పరమం దైక్యంబుఁ బ్రాపింతు రే
న్వాశ్వాసంబునఁ దత్ఫలార్థినగుచు న్నిన్గొల్చుచుంటిం జుమీ
శశ్వన్మంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 143

శా॥ అక్షుల్నిన్గనునట్లు హస్తములు నిన్నర్చించునట్లాత్మ ని
న్నక్షీణంబుగ నమ్మునట్లు చెవి నిన్నాలించునట్లాస్యమున్
దీక్షన్ నిన్నొనియాడునట్లు కరుణన్వీక్షించి రక్షింపుమీ
సాక్షాన్మంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 144

మ॥ సుగతింగోరుదుఁగాని యేసుకృతమెచ్చో నైనఁ జేయంగ నై
తి గజేంద్రస్థితి నుంటి నిన్గొలుచుచుంటిం బారతంత్ర్యంబు చే
త గుఱెందప్పించరించుచుంటి నయినం దాసుండ నైతిం జుమీ
జగతీమంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 145

మ॥ మును నీసన్నిధిఁ దక్కఁ దక్కిన ఫలంబుల్ పుట్టుచుం గిట్టుచుం
గనుఁగొంటిం గనుఁగొంచునుంటి నిటపైఁ గారుణ్యమే పారఁగా
ననునీసన్నిధిఁ జేర్చుకొమ్ము దెసుమీ నాప్రార్థనీయంబు స
జ్జనతామంగళసంఘసంఘటనతృష్ణా బాలకృష్ణా హరీ॥ 146

క॥ చనువున నింతియ నా కో। రినయది నీ వింత మాత్ర గృప సేయఁగదే 147
వినతాశ్రితవనచైత్రా। వినతాసుతపత్ర వేదవినుతచరిత్రా॥

క॥ అని యీగతి వినయాగతిఁ। దన రారఁగ భక్తియుక్తితత్పరుఁడగుచున్ 148
వనజాక్షుని వినుతించిన। జనితానందమున సుప్రసన్నుండగుచున్॥

## ముచికుంద వరప్రదానాదిప్రశంస-

ఉ॥ కోరి ముకుందుఁడట్లు ముచికుందునకున్ వరమిచ్చి వచ్చి, కాం

తారమలీలఁ గాలయవనప్లుతనం జతనంబులేక డా
సీరియు నేకమై తునిమి శ్రీమధురా ధనధాన్యసంపదల్
వారక ద్వారకాపురికిఁ బంప జనుల్గొనిపోవుచుండఁ గాల్॥ 149

## శ్రీద్వారకాపుర ప్రవేశము-

సీ॥ అంత జరాసంధుఁడంతక నిభసైన్యములతోడ మధురను ముట్టడించి
రామకృష్ణులు ప్రవర్షణగిరిశిఖరంబునకుఁ బోవుటరసి వెఱ దవిలి వారి
మతమెఱుంగక భయంపడి మఱుపడిగని బ్రమసి వారి దహించు వాఁడు బోలె
నగ్గిరి డగ్గరి యగ్గి రవుల్కొల్పి ప్రాగ్గిరి వారని మరలి పోయెఁ
బదునొకండామడలపొడవెత్తఁగియున్న । యున్నతగ్రావశిఖరంబునుండి హరియు
హలియు నింతకుమున్నె సైన్యములవెలికి। దాఁటి ద్వారకఁ జేరి రత్యద్భుతముగ॥

## శ్రీమధురా క్షేత్ర మాహాత్మ్యము-

శా॥ శ్రీకృష్ణాభ్యుదయంబునన్ మధురయే క్షేత్రోత్తమంబౌచు నా
రా కాశ్యాదులకన్న జన్మమరణ బ్రహ్మోపదేశాంగదా
హాకార క్రియలం జతుర్విధముగా నైక్యప్రదంబౌచు ను
ద్రేకించెన్ మహిమంబునన్ జతురశీతిక్రోశమధ్యంబునన్॥ 151

## శ్రీద్వారకాపుర వర్ణము-

శా॥ మున్నింద్రాదిపురంబులెల్లఁ దనకూర్పు న్నేర్పు రాజిల్ల నో
జన్నిర్మించిన విశ్వకర్మ హరియాజ్ఞం జేర్మి నిర్మించె న
మ్మున్నీ రంతరమిచ్చె లక్ష్మికదియే పుట్టిల్లునట్టిల్లుఁ బెం
పెన్నన్ ద్వాదశయోజనంబులు తరంబే ద్వారకం బేర్కొనన్॥ 152

సీ॥ అకలంకనిత్యపూర్ణకలావిరాజిత ద్విజరాజరాజి ప్రదీపితంబు
సంతతక్రతువృద్ధిసంపాదనానుగ్రరాజావతంస విరాజితంబు
మిత్రసంప్రీణనస్తోత్రపాత్ర నిధీశపుణ్యజనార్యవిస్ఫూర్జితంబు
సఫలహలక్రియా సంపూర్ణ బలభద్ర శూద్రవర్ణబలాభిశోభితంబు
విబుధకులవృద్ధి శైతల్యవర్ధి శుభస। మృద్ధి పుణ్యాభివృద్ధి జడేతరర్ధి
శుద్ధి ధనవృద్ధి బహుముఖసిద్ధి విజత। సురవరపురంబు ద్వారకాపురవరంబు॥

చ॥ లలనలు తత్పురీ దయితులం దమిఁ గాఁగిఁటఁ జేర్చి చంద్రశా
లల నలుపొంద మఱ్ఱ రతివిలాసి జయించుటకేఁగి వారి లీ
లల నలలోచన ప్రభఁ జెలంగఁగనుంగొని భీతినిండ్లగో

లలనలు దిక్కులన్ విడుచు లక్షణముం దెలుపున్ వెడల్విరుల్॥ 154

చ॥ తనరు హరిన్మణింబులను ద్వార వితానములొంది చిల్వతేఁ
డను నెలతాల కంబమున నందము నొందుచునున్న భూతలం
బని యెడు మేడలో నిడిన యాంతత దర్పణదీపయంత్రమో
యన ఘన భోగ్యహర్మ్యసహితాచ్ఛమణీకృతవప్రమప్పురిన్॥ 155

చ॥ తరమె నుతింపఁగా మణివితాన వితాన తతానపాయమున్
దిరరుచి కౌముదీ ముదిత దివ్యచకోర ముదగ్రుపూర సా
గర సురదీర్ఘికా వలన ఖండితపత్త్రిసరోరుహస్థ బం
భర పణిభోగశాయి హరి పశ్యద శేష సురేన్ మహాపురిన్॥ 156

మ॥ పురమాశాంతరవర్తికీర్తికలశాంభోరాశి రాడంతర
స్ఫురదత్యున్నతవప్రశృంగదళవిస్ఫూర్జత్సువర్ణోష్టికో
త్కరబద్ధాలయకాంతిరేణుపలషత్పద్మాతుభృంగోజ్జ్వల
ద్ధరిదుర్గాంబుజనాళలీలఁదగు నుద్యత్కేతనంబప్పురిన్॥ 157

క॥ ఆపుర మున్నతగోపుర। మై పరఁగి పయోరుహాసనాండోర్ధ్వపుటం
బేపున భేదించియ కా। దే పుటభేదనసమాఖ్యఁ దెచ్చెఁ బురులకున్॥ 158

మ॥ వినతానందన విశ్రుతిం దనరుచున్ వేదాత్మకత్వంబు మున్
గనుటన్ వ్యాకరణప్రవీణత ననంతఖ్యాతిసంపత్తిచే
మనుటన్ ముప్పదిరెండునాఁ దనరు సమ్యగ్బ్రహ్మవిద్యల్ గనుం
గొనుటన్ నామము సార్థకంబగుచు వెల్గుం దద్ద్విజశ్రేణికిన్॥ 159

మ॥ నరమాత్రుల్సొరరానిచోటవలనన్ నానాప్సరోయక్ష కి
న్నర విద్యాధర సిద్ధకింపురుష గంధర్వాదులయ్యోపనుల్
పురిఁ గావించి గడించుచున్న విభవంపుం బెంపు వీక్షించుచున్
హరికర్పింపని నాటికల్మిగని యత్యాధ్యక్షుఁడౌం సంద్రపన్॥ 160

శా॥ అన్నాళీకదళాక్షుఁ డన్నిటికి నధ్యక్షుండు నుంగారణం
బి న్నానావిధ విష్టప ప్రతతి తత్సృష్టంబు తత్పుష్టమున్
దన్నిష్టంబును దద్వినష్టమగుఁ గ్రీడామాత్రమాప్రోడకే
తన్నిర్మాణభృతి ప్రభృత్యఖిల కృత్యంబెన్న నత్యంతమున్॥ 161

ఇంద్రాద్యమరసమర్పిత తత్తద్వైభవ ప్రశంస-

సీ॥ పారిజాతంబుతోఁ బరమాద్భుతంబగు తగుసుధర్మను బురందరుఁడొసంగె

శ్రవణైకదేశమేచకమనోజవశుక్లవర్ణతురంగముల్వరుణుఁడొసఁగె
వగనామకంబైనవరనిధినాక్కటి దక్కఁదక్కిన నిధుల్ధనదుఁడొసఁగెఁ
దక్కినదిక్పతుల్దమకుమన్నీశ్వరుండిచ్చిన సంపదలెల్లనొసఁగి
రిట్టిసంపదలకునెల్లఁబుట్టినిల్లు। నైపరఁగుద్వారకాపురి నధివసించి
హలధరుఁడురేవతింబెండ్లియాడెఁ గృష్ణుఁ।డష్టమహిషులఁబెండ్లాడెనద్భుతముగ॥

## రేవతీ పరిణయము-

సీ॥ కృతయుగమందు రైవతుఁడనురాజురేవతియనఁదగుతనసుతకుఁబెండ్లి
సేయఁదలంచియేతీతిపతినాల్లక కన్యతో సత్యలోకమునకరుగ
నృపుతలంపువిరించియెఱిఁగి యిర్వదియెన్మిదిమహాయుగములుగతించెద్వాప
రయుగాంతమిపుడయ్యెరాముఁడు కృష్ణాగ్రజుఁడు గాన నర్హుఁడీసుతకొసంగు
మనఁగనాతఁడు ద్వారకకరిగియెరగి। తనతలంపునువ్యాపంపు నెఱిఁగింప
లాంగలంబునఁ గ్రిందికిలాగికుఱుచఁ। జేసి రేవతిఁబెండ్లాడె సీరధరుఁడు॥

## అష్టమహిషీకల్యాణ ప్రశంస.

### ౧- శ్రీరుక్మిణీ కల్యాణము.

సీ॥ శ్రీశాద్భృతి విదర్భదేశాధిపతిభీష్మకుండు కుండినపురి నుండునాత
నికి రమాంశమునజనించిన రుక్మిణియందుఁగృష్ణుఁడుఁ గృష్ణునందురుక్మి
ణియుఁబరస్పరమోహానిర్మగ్నులైచుండరుక్మిణిసన్నయా రుక్మిపూని
శిశుపాలునకొసంగసిద్ధమైయుండుట ద్విజునంపిరుక్మిణిదెల్పకృష్ణుఁ
డరిగిపురశక్తిఁగనఁబోవుటరసియామె। నరదమెక్కించుకొనిపోవసడ్డుపడినఁ
దలగొఱిగిరుక్మినదలించితరలివచ్చె। యిఁటరుక్మిణిఁబెండ్లాడెఁగృష్ణమూర్తి॥

## ద్రౌపదీ స్వయంవర ప్రశంస-

సీ॥ ద్విజవేషమునద్రౌపదీస్వయంవరరంగమునఁ బాల్చుపాండునందనులఁబోల్చి
శౌరి సీరికిఁజూపి జయమొందునేఁడింద విజయుండనుచుఁదెల్పి స్వజనములను
గదలకుండఁగనిల్పికనుచుండఁ దమకసాధ్యంబైనయంత్రమత్స్యంబునేసి
యాజ్ఞసేని వరింప నరుగు నరుం గని యెదిరించి యోడిర య్యనసుతాదు
లంతపైఁగొంతికొడుకులయంతికమున। కరిగి లాక్షాగృహావిముక్తులైనమిమ్ముఁ
గంటిమిదిపుణ్యదినమువేల్గల్గుమీకు।టంచుపీడ్కొనివచ్చిరిహరియుహలియు॥

### ౨- జాంబవతీ పరిగ్రహణము-

సీ॥ రవి నిత్యమష్టభారసువర్ణమిడు శమంతకముసత్రాజిత్తునకునొసంగెఁ

దదనుజుండు ప్రసేనుఁ డది దాల్చి వేఁటకుఁ జనె వానిసింగంబు దునిమి దానిఁ
గొనె దానిఁ దునుమాడి కొనె జాంబవంతుఁ డీకృత్యమెల్లను దనదె యటన్న
నింద చతుర్థినాఁ డిందునిఁ దాఁ గన్నఫలమని కృష్ణుండు దలఁచి వెలుచ
నడుగుజాడను గుహఁ జొచ్చి యచట జాంబవంతుతోఁ బోరి యాతని వరము దీర్చి
మణిని జాంబవతిం గొని మరలి వచ్చి। మణిని తనికిచ్చి తన నిందమాన్పికొనియె॥

క॥ వాపోపడఁ జూపోపని। పాపోప నిబద్ధలకటపటుకటుచటుల
వ్యాపారం బేపారఁగ। లాపనలం బన్నుచుం బ్రలాపించిరిగా॥ 167

## ౩. సాత్రాజితీ వివాహము.

సీ॥ హరిఁ గోరి నప్పుడీనైతి నూరక నిందమోపితి నతనిపైఁ బాపినైతి
ననుచుఁ బశ్చాత్తప్తుఁడగుచు సత్రాజిత్తు మణితోడ సత్యభామను సమర్ప
ణము చేయ హరియుఁ గన్యామణిఁ బెండ్లాడి మరల నాతనిక యమ్మణి నొసంగెఁ
దనకిచ్చెద నటన్న తనయ నన్యున కిచ్చెనని శతధన్వుఁడాతని వధించి
మణిని గొనివచ్చి కృతవర్మ మరుఁగుఁ జొరఁగ। నతఁడు నిరసించె నక్రూరుఁ డట్లయనఁగ
నతనికడ నిడి చనుచుండ హరి వధించి। మణికి నక్రూరు రావించి మరల నొసఁగె

వ॥ అది యెట్లనిన,

సీ॥ నను నిల్పి శతధన్వుఁ జునిమి శమంతక మపహరించితివి లేదంటి వడుగ
శపథముల్ కపథముల్ చాలుఁ జాలును నమ్మఁ జాల నిన్నని సీరి శౌరి వదలి
మిథిలలో మూఁడేండ్లు మెదలి దుర్యోధనునకుఁ జా గదా కదనంబుఁ గఱపె
సవనదీక్షా కవచ సురక్షితుండౌచుఁ గాశికాపురినుండెఁ గాందినేయుఁ
డపుడ వగ్రహశాంతి కై యతని నితనిఁ। బిలిచి మణిఁ గొని కలుఁ ద్రావు హలధరుండు
నేను స్త్రీలోలుఁడను నీవు నియమశాలి। వింద మని గాందినేయునికే యొసంగె॥

## ౪. కాళిందీ కల్యాణము.

సీ॥ పాండుసూనులఁ జూడఁ బుండరీకాక్షుఁ డింద్రప్రస్థపురి కేగి తాను నింద్ర
నందనుండును యమునాతటంబున వేఁట లాడుచు నాక కన్యనం బఁ గాంచి
తన్వరింపఁగ నీటఁ దన్వి తపించుట కాళిందియాదిత్యకన్య యగుట
విజయా దౌత్యంబున విని సంతసిలి తదన్వితము గాఁ దోతెంచి విశ్వకర్మ
పేరిపురిఁ జిత్రతరముగా నింపఁ బంచి। ఖాండవముఁ ద్రాఁచు నెడఁ గాచి గాండి నాడు
లగ్ని సభ మయుఁడిడఁ గ్రీడికబ్బఁ జేసి। ద్వారకకువచ్చి యామె నుద్వాహమయ్యె॥

## ౫. మిత్రవిందా పరిణయము.

సీ॥ అల నవంతిదేశాధీశులైన వింద్యానువిందులు కౌరవాధిపత్య
ధీనులై కృష్ణుని మేనత్తయైన రాజాధిదేవికిఁ గడునను(ఁ)గుపట్టి
తమకుఁ జెల్లెలు నయిత గుమిత్రవింద కుద్వాహంబనుచు స్వయంవరము సాటఁ
బనిచిన విని చని వనరుహనయనుండు రారాజు మొదలైన రాజులరయ
నయన విజితారవింద దంతజితకుంద! చికురజితనీలకంద దృగ్జితమిళింద
మిత్రబృందావనానంద మిత్రవింద! నవుడు చేకొనె నృపులంద అళుకుఁ జెంద॥

## ౬. నాగ్నజితీ పరిణయము.

సీ॥ నగ్నజిత్తనియెడు నామధేయమునఁ గోసలదేశమునకధీశ్వరుఁడుగలఁడు
నాగ్నజితియనఁదగు నాతనికన్య యామె నురాజన్యులడుగఁ గాఁగ
సప్తగోవృషముల సమ్ముఖమ్మున నిల్పి వీనిఁ బట్టిన వానికే నాసంగు
వాఁడఁ గన్య ననంగ వశము గాకందఱు విముఖులై పోవుటవిని చని హరి
సప్తరూపమ్ములై గోవృషములఁ బట్టి! గట్టిగాఁ గొట్టి యీడ్చి పోగఁ ద్రొక్కి
నాగ్నజితినప్డు పెండ్లాడి నగరికరిగె! నడ్డముగవచ్చి వివ్వచ్చుఁ డరులఁ దునుమ॥

## ౭. భద్రోద్వాహము.

సీ॥ సౌందర్య సౌశీల్య సౌభాగ్య సాముఖ్యముఖ్య సద్గుణగణాద్భుతసముద్ర
బంధుమిత్రాతిథిపండితకవి భృత్యసాధుదీనార్థిపోషణ వినిద్ర
పతితపాషండ దుర్వ్యాపారపిశునాదిహీనసంభాషణమౌనముద్ర
భర్తృశుశ్రూషాదిపరమధర్మాభ్యాసపాటవతులితశుంభత్సుభద్ర
మందగమనవినిర్జితమహితభద్ర! పరమపావనచారిత్ర భద్ర భద్ర
మేనత్తకూఁతలుగావున మేరసెడక! కేకయుఁడొసంగఁ బెండ్లాడెఁ గృష్ణుఁడెలమి॥

## ౮. లక్షణా కల్యాణము.

సీ॥ మద్రాధిపతులకు సద్రాజధానియై పొలుపొందు శాకల్యపురమునందుఁ
దగు బృహత్సేనభూధవశిరోమణికిఁ దొలుస్యంశమునఁ బుట్టె లక్షణాఖ్య
నాకకన్యా యామాన్య కుద్వాహమొనరింపఁ దొడఁగునప్పుడు నారదుండు వోయి
కృష్ణచర్యలు సంగ్రహించి తెల్పుచుఁ గృష్ణునికిఁ గన్యనిచ్చువానిగ నొనర్చి
కృష్ణుకడకేగి లక్షణాకృతిను తింపఁ! గృష్ణుఁడు స్వయంవరోదంత మెఱిఁగి యరిగి
యంత్రమత్స్యము నేసి కన్యనుగ్రహించి! వైరులను గెంటియింట నుద్వాహమయ్యె॥

క॥ కల్యాత్ముఁడష్టమహిషీ। కల్యాణకథాభరంబుకర్ణరసజ్ఞా
కుల్యల జాలొల్కఁ జల్పుచు సా। కల్యమునం గాంచునిష్టకల్యాణములన్॥ 175

## తీర్థస్నానాభిగమనము.

సీ॥ శౌరిశమంతపంచకతీర్థమునకు సాప్తముగ సూర్యగ్రహణమునకరిగి
స్నానదానాదులు సలిపినపై యశోదానందపాండునందనముఖాత్త
జనులను వేర్వేఱ సముచితరీతిగా సల్లాపములనుల్లసిల్లఁ జేసి
కుంతియు వసుదేవుఁ డెంతయు స్వప్రశంసనొనర్చికొనుటకు సంతసించి
కృష్ణుఁడును గృష్ణముఖులొకకెలననుండఁ। గృష్ణయును గృష్ణసతులొకకెలననుండి
సరససల్లాపములొనర్చు సమయమందు। నిందఱిని జూచి ద్రౌపది యిట్టులనియె॥

శా॥ రాకాచంద్రనిభాస్యలార కనులారం జూడకున్నన్ మనః
ప్రాకామ్యంబు ఫలించునట్లు చెవులారన్ వింద సానందనై
మీకల్యాణచరిత్రఁ దెల్పుఁడనఁ జెల్మిం దెల్పి రా చెల్వలా
జోకన్ లక్షణ దెల్పెఁ దెల్పితినటుల్ సూక్ష్మప్రకారంబులన్॥ 177

## నరకాసుర సంహారము.

సీ॥ నరకాసురుఁడు క్రొవ్వి సురమాతృకర్ణకుండలములు వరుణుఛత్రంబు సురల
మణిపర్వతము హరింప నిలింపపతి దీనుఁడై విన్నవింపఁగా హరియు సత్య
భామతో రథమెక్కి ప్రాగ్జ్యోతిషము జేరి దుర్గసప్తకముఁ దుత్తుమురుఁ జేసి
మురు నైదుశిరములు ధరఁ గూల్చి తత్సప్తనందనుల వధించి నరకుఁ ద్రుంచి
వానిసుతు భగదత్తు సంపన్నుఁ జేసి। ఛత్రకుండలమాలికా చిత్రరత్న
దాత్రియై ధాత్రి వేడఁ దద్వశగ సశత। షోడశసహస్రకన్యలఁ దోడి తెచ్చె॥

## సశతషోడశసహస్ర స్త్రీ ప్రశంస.

శా॥ అష్టావక్రుఁడు నీటనిల్చి సురకన్యానృత్తగీతాదులన్
హృష్టుండై హరిపత్నులౌనటు వరంబిచ్చెం దనున్ నవ్వఁగా
రుష్టాత్ముండయి ముక్తి లేక శబరుల్ రోధింప మీ విష్టపం
బిష్టప్రక్రియఁ జేరు వారని యె వారే వీరు నిక్కంబుగాన్॥ 179

క॥ మురపాశపరివృతం। బాశరగిరిశస్త్రాగ్ని వాయుజలదుర్గంబై
కరమరుదగు ప్రాగ్జ్యోతిష। పురమొరులు జయింపఁగలరె భువి హరి దక్కన్॥

## పారిజాతాపహరణము.

క॥ కుండలములదితికిచ్చెన్। మండలము లభించినట్లు మాతయు మెచ్చెన్

భండనమునఁ బురెవిచ్చెన్। హిండనమునఁ బారిజాతకుంటికిఁ దెచ్చెన్॥ 181

శా॥ పౌలోమీరిత రీతిఁగా నదితికిన్ భక్తిప్రయుక్తాంకము
ల్పైఁ బౌలోమిఁ జూఁగ సత్యభామ వినతుల్గావించి సేవించు పెం
పౌలోమీశ వేడ్కఁ జేఁ గనుచు నిత్యాగణ్యతారుణ్యముల్
మేలౌ మీ రనురక్తినొందఁ డనుచున్ దీవించె దేవాంబయున్॥ 182

మ॥ హరికే చెల్లెనుగాక పాకరిపు నుద్యానంబుఁ గాల్పింపఁగాఁ
దరమెవ్వారికిఁ బారిజాతముల కీర్తన్యుండుగా కన్యులె
వ్వరు దేఁ జాలిరి కిలికిలములఁ ద్రావన్ గోవులం బ్రోవ భూ
ధరమెత్తం గరిణోత్త మత్తులను మొత్తన్ గొల్లకుం జెల్లునే॥ 183

## సాత్రాజితీ గౌరవాభివర్ణనము.

మ॥ క్షితి ప్రార్థింపఁ దదర్థమై యవతరించెన్ గృష్ణుఁడై విష్ణుఁ డా
క్షితి సాత్రాజితిరూపమూని జనియించెం గాన సర్వోన్నతా
దృతి పాత్రంబయి సత్యభామ దనరారెం గానిచోఁ బారిజా
త తరుప్రాపణమే నిదర్శనము సౌందర్యాప్త లక్ష్మిండఁగా॥ 184

## శ్రీ రుక్మిణీప్రణయకలహ నివారణము.

శా॥ ఓహో రుక్మిణి లక్ష్మియయ్యుఁ దన పెంపూహింప నట్లుండెఁ ద
న్మోహోద్రేకముఁ దీర్తునంచు విరసంబుల్ వల్కి యుల్కించి పూ
ర్వాహోపూరుషికం బెకల్చి సదయుండై తత్ప్రియం బెట్లుటుల్
స్నేహోత్సాహము లేర్పడంగ నలరించెం గృష్ణుఁ డా రుక్మిణిన్॥ 185

## నారదసందేహ నివారణము.

చ॥ లలిఁ బదియారువేల సతులం బతియుం బదియారువేల రూ
పులగుచుఁ బెండ్లియాడెనఁట పోయి కనుంగొనివత్తునిప్డె దే
వెలువున నందునో యనుచుఁ జిత్తమునం దలపోసి నారదుం
డెలమిని ద్వారకా నగరికేగి సవిస్మయుఁ డయ్యెఁ దత్కృతిన్॥ 186

## అతిథిసత్కార ప్రశంస.

సీ॥ కృష్ణస్వభావపరీక్షకై దూర్వాసుఁ డరుదెంచి వికటచర్యల నటించి
పాయసవాంఛఁ దీర్పవె కృష్ణ యనఁ నట్లు కూర్చి తెచ్చిన దానిఁ గొంత గుడిచి
తన మేన నలఁదించుకొని కొంత రుక్మిణీకాంత కలందఁ దీయయ్యెం తిరస్కృ
రూపిణిగా రథారూఢుఁడై కొట్టుచు నల్లటు పెట్టియూరెల్లఁ జుట్టి

యగ్గరితఁ బ్రమోగ్గతిలనల్లి డిగ్గనుఱికి । బుగ్గిపైఁ జల్లి పాయసంబు సొడశేల్లఁ
బూసితివికృష్ణయుడుగునఁబూయపైతి । వందుఁదక్రమతెంచుఁగిడొందవనుచు ॥
మ॥ కరుణింపందలపోసి రుక్మిణినటుల్ గాసిల్లఁగాఁజేసి యా
తరుణింజూచి వెలందులందు నజహాత్సౌందర్యసౌభాగ్య వి
స్ఫురణన్నిస్తులవాదు పీవనిచనైకశోభావిభూత్యన్నతిం
బరణించెం దమదేహగేహములు విప్రుణ్ మెచ్చిరాదంపతుల్ ॥ 188

## దూర్వాసుని జన్మ వృత్తాంతము.

సీ॥ శ్రుతులశ్వములు చంద్రసూర్యులుండలు భూమిరథము విధాతసారథి సురాద్రి
ధను వసంతుఁడు నారి బారథికుండునై యమపుంఖ శరశల్య హరిశరమున
రుద్రుండుత్రిపురాసురులసంహరించి మున్నయ్యస్త్రము నిజాంకమందుఁ జేర్చి
కూర్చుండెఁ బంచశిఖుండగుసంయమియయ్యెనయ్యమ్మ నెయ్యమ్మహత్రి
కృత్తివాసుండు దుర్వాసుఁడితఁడనియె । నత్రి ప్రార్థింపఁదత్పుత్త్రుఁడయ్యెనతఁడు
నిగ్రహానుగ్రహసమర్థుఁడుగ్రుఁడాగ్రహించి బ్రహ్మాండమును దహించుఁ బెంచు దయను ॥

## సుభద్రా పరిణయము.

సీ॥ శపథభంగంబు బీజముగాఁగ విజయుండు తీర్థయాత్రకు బైలుదేరునపుడు
లూచి చిత్రాంగదనేచి వివాహమై యతివేషమున ద్వారవతికి రాఁగ
సతనిచిత్తమెఱింగి హరియంతిపురిఁ జేర్చి పరిచరించుటకు సుభద్రనునిచి
పశుపతిపూజనైపంబుగా రామాదిఘనుల నంతర్ద్వీపమునకుఁ జేర్చి
తానునింద్రుఁడు స్మరణమాత్రమునఁగూడి । పెండ్లిచేసి సుభద్రనువిజయుననిచి
హాలి కినుకమాన్పి వారికిహరణమొసఁగి । పాండవాచ్యుతుఁడైవచ్చె ద్వారవతికి ॥

## కైలాసయాత్రా ప్రశంస.

సీ॥ రుక్మిణివాంఛఁదీర్చుటకుఁబుత్త్రార్థియై వాసుదేవుండు కైలాసయాత్ర
కై వెలువడిబదరివనంబున ఘోరతపమొనర్చుచున్నతఱిఁ బిశాచ
నాయకుండైన ఘంటాకర్ణుఁ డలకృష్ణుఁ డెందొప్పఁ గని తరియింతునెప్పు
డనుచు వేఁటాడుచు నాత్మసన్నిధికిరాఁ బ్రశ్నోత్తరములఁ దద్భక్తినరసి
బోను వెలి నేకరీతిఁగాఁ దానతోఁచి । ద్విజశవము పావనము దీనిఁదినుమన నగి
హితమెఱింగి సాయుజ్యహేతువైన । దివ్యరూపమొసంగెభక్తికెనగలదె ॥

## ప్రద్యుమ్నోపాఖ్యానము.

సీ॥ ప్రద్యుమ్నుఁడైపుట్టె రతిపతి రుక్మిణీకృష్ణులకనివిని కీడుమూడు

నని శంబరుఁడు సప్తమనిశీథమున మాయవలన దొంగిలి వాని వార్ధి వైవ
నొకమీను మ్రింగె జాలికుఁడు దానిం బట్టి యిత్తుమతిపురికేగి శంబ
రావరోధమగు మాయావతికొసఁగెఁ దద్గర్భముఁ జించు యందర్భకుఁగని
పెంచి మాయలు నేర్చి మోహించి తాను। రతియగుటఁ దెల్పి పురికొల్ప రక్కసుని వ
ధించి యతఁడును మాయావతియును రాఁగ। యదుకులము సంతసిలె నారదాభినుతిని॥

## రామకృష్ణుల సంతాన ప్రశంస.

క॥ శతుఁ డుల్ముకుండు శరణ। కర్మరులగు పుత్త్రులుగఁ బడసి రాముఁడు పుత్త్రిం
గతినగు చం గనకాంగిం। బతసియగుణ సుభద్ర పట్టికొసంగె॥ 193

సీ॥ సరవిఁ బ్రద్యుమ్నుండు చారుచంద్రుండును జారుదేష్ణుండును జారుబాహు
జారుదేహ సుచారు చారులు ప్తవిచారు భద్రచారు సుదేష్ణ్యులద్రినిభులు
పదుగురు తనయులొప్పెఁ జారుమతియను తనయ రుక్మిణియందు జననమయ్యె
సాంబ సహస్రజిచ్ఛతజిత్సుమిత్ర మిత్ర క్రతువిజయులు ద్రవిడచిత్ర
కేతుపురజిత్తులనఁగఁ బ్రఖ్యాతిగన్న। సుతులఁ బదుగురఁ గని మిత్రవతియనంగ
వినుతికెక్కిన చక్కని తనయ నాకతెఁ। గనియె జాంబవతీదేవి మనము దనియ॥

సీ॥ భానుఁ బ్రభాను స్వభాను స్వర్భాను శ్రీభాను బృహద్భాను భానుమంతు
నతిభానుఁ బ్రతిభాను నలచంద్రభానునిఁ జారుభ్రమరికను సత్య గనియె
శ్రుతకవివృష వీర సోమక శాంతి భద్రులు పూర్ణిమాసదర్శులు సుబాహుఁ
డను పదుగురు పుత్త్రులను గాత్రవతియను తనయ వికర్తన తనయ గనియెఁ
బవనవృష నారగృధ్రాంకవహ్నివర్ధ। నానిలమహాసనత్సుధ లనెడు సుతుల
బహుపురను భద్రవతియనఁ బరఁగు సుతను। వేడ్కలిగురొత్త గా మిత్రవింద గనియె

సీ॥ వీరచంద్ర వృషాశ్వసేన వేగవదామవసు కుంతి శంకువీర వదభిఖ్యు
లగు పదుగురు పుత్త్రుల నలస్వోతయనఁగఁ జెలఁగు పుత్త్రిని నాగ్నజితియు గనియె
శరవిహార సుభద్ర సంగ్రామజిద్వామ సత్యక ప్రహరణజయులు హరిచి
దాయుర్బృహత్సేనులను పుత్త్రులను దామ్ర పత్రికయను సుత భద్ర గనియె
బలుఁ బ్రఘోషు నిసింహుని బ్రబలునూర్ధ్వ। సహజున పరాజితుని మహాశక్తి నజుని
గాత్రవంతుని సుతదశకంబు గాఁ జ। లందమను పుత్త్రిఁ గాఁ గనె లక్షణయును॥

సీ॥ వినుఁడింకఁ బదియారు వేల నూర్గురియందుఁ బ్రత్యేకముగ సుతుల్ బదుగు రేసి
పుట్టిరి వారును బుత్త్రులఁ గాంచుచు యదు వృష్ణి భోజాంధకాదులనఁగ
జగతి నేకోత్తరశత శాఖలై రిట్లు ప్రబలిన హరిపుత్త్ర పౌత్త్ర జనము

నకుమూఁడుకోట్లయెన్బదియెనిమిదివేల నూర్గురుగురువులావర్గసంఖ్య
భర్గుఁడైననుగృతజగత్సర్గుఁడైన। నింతయనిచెప్పలేరన్ననితరులెన్నఁ
గలరెవలపేనితండ్రిజగత్కుటుంబి। తత్కుటుంబముగానిదిద్ధరణిఁ గలదె॥

శా॥ కుబ్జాకృష్ణులకుద్భవించి సువివేకుండై యుపశ్లోకుఁడ.
య్యబ్జాతాసనుపుత్త్రిశిష్యుఁడయిదివ్యజ్ఞానియైతా నను
ష్టుబ్జాలంబునఁగూర్చిసాత్వతమనంజూపట్టుతంత్రంబదే
న్యబ్జాస్త్రీపరిచారికాపదజమోక్షోపాయమంత్రంబుగన్॥ 198

## అనిరుద్ధవివాహ మహోత్సవము.

సీ॥ స్వస్ృవత్సులుఁడు రుక్మిస్వసుతయైన తనురుక్మవతినిశ్రీరుక్మిణీసుతులయందుఁ
బ్రద్యుమ్ననకొసంగిప్రద్యుమ్నసుతుఁడైన యనిరుద్ధునకుఁదనమనుమరాలి
రుక్మలోచనయను రుచిరాంగినొసఁగెఁదత్పరిణయాగతులైనధరణిపతులు
పెరశేపఁగా దురోదరమునదబ్బరలాడిన రుక్మిని హలివధించెఁ
బరిణయానంతరమునదంపతులఁగొడు। కొనుచుద్వారకకేతెంచిరనుపమాన
మానసీయోత్సవంబుతోమాధవాడు। లవల బాణాసురునిగర్వము డఁచిడిచె॥

## ఉషా పరిణయము.

సీ॥ హరదత్తవరమత్తుఁడగుచుబాణాసురుండతఁడుగావలియుండ నతిశయించి
యుండెఁదత్పుత్త్రికయుషయొక్కచక్కనిపురుషుతోస్వప్నసంభోగమొందె
మందటివవెనుఁడమిందెలిసి తదాప్తసఖిచిత్రరేఖ తత్స్వాంతమెఱిఁగి
రాజరూపములెల్లవ్రాసిచూపఁగ ననిరుద్ధునిఁజూపితత్సిద్ధిఁగోర
యోగబలమునఁబ్రియుఁదనకొసఁగనతని। వలననుషగర్భవతియాటఁదెలిసిబాణుఁ
డతనిఫణిపాశమునఁగట్టె నని విని హరి। శోణపురికేగిచేసినచాప్పువినుఁడు॥

## బాణాసురగర్వ పరిహారము.

సీ॥ వాసుదేవుండుకైలాసయాత్రకుఁ బోయి యుపమన్యునుపదేశమొంది ఘోర
తపమొనరింపఁ బ్రత్యక్షమైత్ర్యక్షుండుమున్నువరంబిచ్చి యున్నదియును
బ్రహ్మసునకువధింపఁ ద్వదీయులనటంచుమున్ను వరంబిచ్చియున్నదియును
గారణంబులుగరక్షకుఁడైయెదిర్చిన ఘోలాత్మునంతలోపలవిదిర్చి
సమవివాదవివాహముల్ శ్లాఘ్యములని। పట్టిబాణాసురునిఁజతుర్బాహుఁజేసి
విడిచియుషతోడ ననిరుద్ధువేడ్కగాఁగ। నోడ్కొనుచువచ్చెద్వారకాదుర్గమునకు॥

## కరిపురోత్పాటనాది ప్రశంస.

సీ॥ అలసుయోధనుకూఁతురగు లక్షణను వివాహమున సాంబుఁడు సాహసమున నె
త్తుకొనిచనఁ గనుఁగొని మునుకొను కినుకను జనఁగొను మనమున వెనుచనిచని
రాధేయశల్యసుయోధనప్రభృతులు గవియఁగా నిభృతుఁడై కవియుటరసి
యందఱుఁబొదివి నిరాయుధుఁ జేసి సుందరినాతనిం గరిపురికిఁ దెచ్చు
టమరము నిదెల్పనని కేగు హరి నినిల్పి। హలియచటికేగి విఫలప్రయత్నుఁడగుచు
సమరనదిఁ గల్పఁ గరినగరముఁ బెకల్పఁ। వినతులై వారి నాసఁగఁ దోడ్కొనుచు వచ్చె॥

## పౌండ్రకవాసుదేవ సంహారము.

మ॥ అహహా పౌండ్రకవాసుదేవుఁ డనువాఁ డత్యుద్ధతిన్ దూతఁ బం
చి హరి న్నిందయొనర్పఁగా హరియుఁ గాశిం జేరి వానిన్ వధిం
చె హరుం గొల్చెఁ దదాత్మజుం డనలుఁ డిచ్చెం గృత్తిఁ బుత్తెంచె దా
ని హరిప్రేరితమై సుదర్శనము డానిన్ వానిఁ గాల్చెం బురిన్॥ 203

## కాళిందీ భేదనము.

మ॥ ప్రియులన్ బంధువులన్ గనన్ హలి లలిన్ వ్రేపల్లెకుం బోయి త
త్ప్రియగోష్ఠిన్ విహరించుచున్ వరుణనిర్దేశాగతన్ మద్యభా
వయుతన్ వారుణి నాదరించి సొలపై వాఃకేళి కింపెల్ల ను
ల్కొయి రామున్ విదళింప నయ్యమున యేతై దీర్చెఁ దత్కోపనన్॥ 204

## యమునానదీ వర్ణనము.

సీ॥ ఆవర్తనాభి దీప్యత్సైకతశ్రోణి చక్రవాకస్తని సరసహృదయ
వీచీభుజాక్షేప విస్ఫురన్మీనాక్షి భృంగరోమావళి ఫేనహాస
కలహంసకలనాఢ్య కల్హారకర్ణిక శైవాలకచ ధాతుచందనయుత
ప్రక్వణత్కంకణ భాస్వద్ద్విజశ్రేణి ఘనపుష్పమయవేణి కంబుకంఠి
వికసితాంబుజవదనయై విభునిసదన। మునకుఁ జను శైలజవ్వని ననుకరించి
తనరె నారవికర్తనతనయ పేరు। సార్థకము గాఁగ వాఁకయై యరుగునపుడు॥

చ॥ ఒకయెడ మందమందగతి నొక్కొకచో నతిశీఘ్రయానమిం
కొకదరి సంకుచత్వ మొకయోర వికాసము ప్రత్యగార్ద్రిత
త్వకలన నొక్కచోటు నొకవంకఁ బరాఙ్ముఖతం గభీరిమం
బొకదెస నొక్కచో నిలుపు నొక్కకడం గుటిలత్వ మొందుచున్॥ 206

సోదఁజొరఁబోవఁ గృష్ణుండువారించి తత్సహితుఁడై రథమెక్కి జాముచేళ
కుత్తరనగాభితవములనుత్తరించి। జ్వాలలోఁ జొచ్చి పరమేశ వశగ శిశు గ
ణమ్ముఁ దోడ్తెచ్చి ద్విజునకు నెమ్మినిచ్చి। వచ్చి క్రతుశేషమునొనర్చె నచ్చెరువుగ॥

## జరాసంధ సంహారము.

సీ॥ దృఢజరాసంధబందీకృత రాజులు విప్రముఖంబున వేడుటయును
రాజసూయమునధర్మజరక్షణ మపేక్ష్యమంచు నారదుఁడు విధించుటయును
మగధేశుఁ డెగటార్పుమార్గంబు సూచించి ప్రీతినుద్ధవుఁడు ప్రార్థించుటయును
స్వమతంబునకు సుపష్టంభకంబులుగ నింద్రప్రస్థపురికి సాప్తముగ నరిగి
ధర్మజానుమతంబునఁ దదనుజన్ము। సహితముగ విప్రతనుజరాసంధుఁ జేరి
పోరుఁగోరి తమ్మెఱిఁగించి చీరి వైరి। భీము చేతఁ జంపించి భూవిభులఁ దనిపె॥ 213

## శిశుపాలశిరచ్ఛేదము.

మ॥ కృశశీలుండు యుధిష్ఠిరుండిచట ధాత్రీదేవులుంచుండఁగా
దిశలేలుండని ధాతనిల్పిన ధరిత్రీపాలురుంచుండఁగాఁ
బశుపాలుండు ప్రపూజ్యుఁ డయ్యెననుచుం బల్మాఱు దూషించుటన్
శిశుపాలుం దలిచెన్ సుదర్శనముసొచ్చెం గృష్ణుఁ దత్తేజమున్॥ 214

## వరసన్మానము-

సీ॥ దమఘోషనృపతి సాత్వతియందు శిశుపాలుఁ గాంచి చేతులునాల్గు కనులుమూఁడు
గార్ధభస్వరమును గాంచి బెగ్గిలుచుండ నశరీరభూతమత్యద్భుతముగ
నెతఁడె త్తికొనునప్పు డీవికృతులడంగునతనిచేత నడఁగు నితఁ డనవిని
యొకనాఁడు కృష్ణు చేతికొసంగునంతనే వికృతులన్నియుఁ బాయవెఱచి కృష్ణ
నూఱుతప్పులు చేసిన నోర్చికొనక। నీకు మేనత్తకొడుకు మన్నింపుమితని
ననుచుఁ బ్రార్థించుటాతంకమయ్యెఁ గాని। వింటినేత్రుంపఁ జేయనిభీష్ముఁడనియె॥

## దంతవక్త్రాద్యసుర సంహారము.

సీ॥ సాల్వుండుమాగధచైద్యాది భూపరాగంబున భూపరాగంబుఁదినుచు
హరుఁ గొల్చితద్దత్తమై కామచారమైనడచు సౌంభకవిమానంబునెక్కి
ద్వారకకేగి యుపద్రవంబులొనర్చి ప్రద్యుమ్నముఖులతో రణమొనర్ప
హరియునింద్రప్రస్థపురినుండివచ్చి యామాయావితో విక్రమమునఁబోరి

కృతకవసుదేవహతికుల్కి కృతమెఱింగి। చక్రమున సాంభకంబుతో సాల్వుఁద్రుంచి
దంతవక్త్రివధించి తత్సహజుఁడగు వి। దూరుఁ గ్రమముగ నొంచె నద్భుతముగాఁగ॥

## శిశుపాల దంతవక్త్రుల పూర్వ వృత్తాంతము.

సీ॥ మున్ను శ్రీవైకుంఠమున ద్వారపాలకులై సనకసనందనావరోధ
మొనరించి పోనీమి నుగ్రులై ఘోర రాక్షసులు గండని వారు శాపమొసఁగఁ
దొలుఁదొల్త జయవిజయులు హిరణ్యాక్ష హిరణ్యకశిపులై వరాహ నార
సింహసంహతులైరి శ్రీరామ హతులైరి రావణ కుంభకర్ణతజనించి
యిపుడు శిశుపాల దంతవక్త్రి పదవాచ్యు। లై పోడిమి కృష్ణు చేమ్రందిరందు వలన
శాపశాంతియైవారి తేజంబు కృష్ణుఁ। జేరెవారు వైకుంఠంబుఁ జేరిరపుడు॥ 217

## ద్రౌపదీ మానరక్షణము.

మ॥ కపట ద్యూతముఁ బన్ని పాండుసుతులం గౌరవ్యులోడించి త
ద్ద్రుపదేంద్రాత్మజనీడ్చి తెచ్చి కినుకం దుర్వాక్యముల్ బల్కి ని
స్త్రపులై వల్వలనొల్వ ద్రౌపది దనుం బ్రార్థింపఁ గృష్ణుం డనే
క పటంబుల్ గృపనూఱఁజేసి సభలోఁ గాపాడెఁ దన్మానమున్॥ 218

## కుచేల సంరక్షణము.

మ॥ అభిధాసూచిత దుర్దశుండగు కుచేలాఖ్యున్ స్వబాలప్రియున్
శుభుఁ డాకృష్ణుఁడు గారవించి యడుకుల్ శోధించి భక్షించి త
త్సభవారబ్బురమంద వీడ్కొలిపె నాతం డింటికిం బోయి స
ద్విభవోపేత గృహంబు గాంచి వెరగొందెం దద్దయాసిద్ధికిన్॥ 219

## నృగశాప విమోచనము.

మ॥ నృగుఁ డిక్ష్వాకుని ప్రాత మందిడినగోవేమందఁ జేరన్ గణిం
పఁగలే కన్యునకిచ్చి పూర్వుఁడు శపింపన్ దొండయై నూత నుం
డఁగఁ గృష్ణుండు సముద్ధరింపఁ దన చందంబంతయున్ దెల్పి ది
వ్యగతిం జెందె నటెంగి భూమిసురులన్ వంచించి యేమాదురో॥ 220

## కామ్యక వనాభిగనము.

సీ॥ పాండవు లడవిలోపలనుండఁ బుండరీకాక్షుండు సత్యభామాన్వితముగఁ
గనఁజనియుండ మార్కండేయ మునిరాఁగఁ బూజించి యతనిచే భూసురప్రి

గీ॥ ప్తపఱచి కిరీటి సంతృప్తికపుడు। విశ్వరూపంబుఁ జూపించి విశ్వసింపఁ
జేసి వైరులఁ బొలియింపఁ జేసెనాఁటి। వారిసంవాదమే గీతయై రహించె॥ 230

## భగవద్గీతాసంగ్రహము.

సీ॥ సాంఖ్యంబు కర్మంబు జ్ఞానంబు కర్మసన్న్యాసంబు నాత్మసంయమవిధంబు
విజ్ఞానయోగంబు విస్ఫుటాక్షరపర బ్రహ్మయోగంబును రాజవిద్య
యనియెడు రాజగుహ్యంబు విభూతివిస్తర విశ్వరూపసందర్శనములు
ప్రకటభక్తియును క్షేత్రక్షేత్రజ్ఞ విద్విభాగము గుణత్రయ విభాగంబును బురు
షోత్తమప్రాప్తి దైవాసురోరు సంపద్విభాగంబు మఱియు శ్రద్ధాత్రయంబు
మోక్షసన్న్యాసమును దెల్పె మునుముకుందుఁ। డర్జునవిషాదయోగంబునపనయించె॥ 231

## గీతాసారసంగ్రహము.

సీ॥ ఆత్మకు లేవు బాధ్యతయు బాధకతయు నని తెల్పుచు విషాదమునకు దయకుఁ
గరణంబులగు నహంకారంబు మమకార మడిగించి సంగరోద్యోగమునకుఁ
గారణంబైన స్వకర్మంబు విడువక ఫలకాంక్ష విడిచి నిచ్చలు నాచర్చి
క్రమముగా సర్వధర్మములను విడిచి నన్నే యాశ్రయింపుమ నే నశేష
దోషములఁ బాపి యుద్ధరింతు నిను వంత। వలదటంచు వచించి విశ్వాసమునకు
విశ్వరూపంబుఁ జూపి యవ్విశ్వభర్త। పార్థుఁడు నిమిత్తముగ మహీభారమడఁచె॥ 232

## అమానుష మహిమానుసంధానము.

ఉ॥ తా రఘురాముఁడైనపుడు తత్త్వరహస్యములన్ గ్రహించె గా
రీ రమణోపదేశమున శ్రీశివగీతలటంచు వానిఁ ద
త్సారతరోక్తులొక్క నిమిషంబు మహాదివసంబు జేసి త
చ్ఛౌరి కిరీటికిం దెలిపెఁ దన్మహిమంబు నుతింపశక్యమే॥ 233

## హనుమచ్ఛాప విమోచనము.

మ॥ భగవద్గీతలు బాదరాయణుకృపన్ భక్తిన్ వినెన్ సంజయుం
డు గుణజ్ఞుండగు నాంజనేయుఁ డవతీర్ణుండై కృతార్థుండవై
తిఁ గడుం గీతలచే నటన్న హరి సీతిం దాఁటి తిప్పెఁ బిశా
చ గతిం జెందుమటన్న భావ్యకృతిచే శాపప్రముక్తింగనెన్॥ 234

## శాపకారణము.

క॥ అనఁగ మునిగణము వెఱఁగై । యనఘ వినఁగ లేదు మున్ను హనుమంతుని మం
త్రనమున శపియించుటయు భాష్యనిర్మితియుఁ దెల్పుమనుడు నతఁడిట్లనియెన్॥ 235

మ॥ దినకృద్దీప్తికిఁ గ్రీడికట్లు భగవద్గీతోపదేశంబుఁ జే
సినపై నాతని కేతనాగ్రమున వాసించి స్నిగ్ధుఁడై యున్న యా
హనుమంతుండు దనంతవే వినుచు ధన్యత్వంబు సూచింపవ
చ్చినవాఁడన్న నైపంబునన్ హరి శపించెన్ భాష్యనిష్పత్తికిన్॥ 236

## బ్రహ్మవిద్యోపదేశ సంప్రదాయము.

ఉ॥ పొత్తములంగనుఁగొనియుఁ బోవుచుఁ బోవుచు నాలకించియుం
జిత్తము తృప్తమయ్యెననఁ జెల్లదు చెల్ల గురూపదేశ సం
పత్తి వినాకరించి పెఱభంగి నెఱింగినవిద్య విద్యగా
దుత్తమసంప్రదాయ విమలోప్పరు తప్పది బ్రహ్మవిద్యకున్॥ 237

## పైశాచభాష్యనిర్మాణము.

మ॥ భగవద్గీతలకింతమీఁద మదభిప్రాయానుసారంబుగాఁ
దగుభాష్యంబొనరింపు మట్లనుచుఁ దప్పం బిశాచత్వమం
చుఁ గృపంగృష్ణుఁడు వల్కఁగా నల మరుత్సూనుండు దోడ్తోఁ బిశా
చ గతిం జెందియొనర్చె భాష్యమదియే పైశాచంబనన్ భాసిలెన్॥ 238

క॥ శపియింపితి గపి యుంచుక । తపియించిన భాష్యరచన తడఁబడుననుచుం
గృప నించుకల్లుతఁ ద్రెం । జపియింపఁగఁ జేసెఁ దద్విజయమంత్ర మిట్టుల్॥ 239

## హనుమన్మహామాభివర్ణనము.

సీ॥ మున్ను దాశరథియై మునులజన్నముఁ గాచి జానకిఁ బెండ్లాడి జనకునాజ్ఞ
వని కేగి ఖరముఖ్యులను గూల్చి రావణువలన సీతను గోలుపడినయపుడు
సుగ్రీవుఁ గూర్చి దశగ్రీవుపురిఁ గాల్చి ధరణిజఁ గని వార్ధి దాఁటివచ్చి
సేతువేర్పఱచి యాజినివాహనంబయై యవలీల ద్రోణాద్రి నటకుఁ దెచ్చి
లక్ష్మణుని బ్రతికించి పౌలస్త్యుఁదునిమి । సీతఁగొని కాతుకముసన సాకేతనగరి
కరిగి పట్టాభిషిక్తుండ నగుట కీవ । కాదె కారణమైతివి కపివరేణ్య॥ 240

షణువదియైనవే లాఘ్నలుఁ బదియునై యశ్వంబు నైచ్చోట నలరుచుండు
నలువొందు శతశతనవశత త్రిశతార్ధశతపత్తి సంపత్తిసరవి నొందు
నట్టి చతురంగబలములు మట్టుమీఱ। నట్టిసేన యక్షౌహిణియనఁగఁ బరఁగు
నదిగదిసి రెండులక్షల పదునెనిమిది। వేలపై నేడునూఱులై వెలయునండ్రు॥ 249

## కౌరవ పాండవ యుద్ధప్రశంస.

సీ॥ ఏకాదశాక్షౌహిణీశులై కౌరవుల్ గాంగేయ కలశజ కర్ణమద్ర
పతులు వరూథినీపతులై క్రమంబునఁ బదియు నైదును రెండు వాసరములు
రెండు యామంబులు భండనం బొనరింపఁ బాండుసూనులు ధర్మపథులెదిర్చి
యరివిజిగీషనేడక్షౌహిణులఁ గూర్చి పేర్చి వైరుల నేర్చి యార్చి యోర్చి
యోధుల జయింపఁ దొలఁగి దుర్యోధనుండు। మడుఁగుఁ జొచ్చిన మాటల వెడలఁబుచ్చి
భీముగదచేత నూరువుల్ విఱుగునట్టు। లతనిఁ గొట్టించి హరి కోపమడఁచె హలికి।

క॥ పదునెనిమిది దివసములీ। పదనునఁ బాండవులు దాయభాగంబునకై
కదన మొనరించుతఱి హరి। మోదమునఁ జేసిన చరిత్రములు చిత్రంబుల్॥ 251

సీ॥ భూరిశ్రవుని కయ్యమున సాత్యకికిఁ గల్గు నవమాన మెడసెంచి యధిఘటిల్ల
మికి సైన్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకంబులఁ బూనిచి గరుడకేత
నము నమర్చిన శతానందాఖ్య మత్స్యందనము పాంచజన్యస్స్వనంబు వినిన
తోడనే సాయుధస్తోమంబుగాఁ దోడితె మ్మెల్లి మద్విక్రమమ్ముఁ గనుము
తగని ప్రతినఁ బట్టెఁ దప్పింపవలెఁ గిడు। క్రీడితోడిదకథ కృష్ణ బ్రతుకు
దారుకా యటంచుఁ దనకాప్తుపైఁ గల్గు। కరుణఁ దెల్పి రాత్రిఁ గడపె శౌరి। 252

మ। నరుచే నర్చితుఁడై తదీయమగు స్వప్నంబందుఁ దద్వ్యక్తుఁడై
హరు దర్శింపఁగఁ బోయి పాశుపతమున్ బ్రార్థింపఁగాఁ జేసి యీ
శ్వరుఁడుం దానొకపాటకుం గుఱుతుగాఁ బ్రాక్పూజలం జూపి ప్రా
గ్వరదార్ఢ్యం బొనరింపఁ జేసి మనిచెం బద్మాక్షుఁ డప్పార్థునిన్॥ 253

మ॥ అనియందే మఱి సైంధవుండు హతుఁడౌనంచున్ నభోవాణి గు
ల్కినపైఁ దజ్జనకుండు బల్కినది శ్రీకృష్ణుండు మున్నే యెఱుం
గును గానం దల వాని తండ్రితొడపైఁ గూలించి తప్పించె ఫ
ల్గును ముప్పందలఁ ద్రోఁచి తజ్జనకుఁడే కూలెన్ స్వశాపంబునన్॥ 254

క॥ సర్వముఖ శిలీముఖ ము।త్సర్పింపఁగ నరదమదిమి సంరక్షించెన్
స్వర్పతి తనయుం గృష్ణుఁడ।హర్పతి తనయుండు విన్ననై కనుచుండన్॥ 255

శా॥ ఇంద్రుండిచ్చిన శక్తిచే విజయుఁ జేఁదేత్రుంతు నేనంచు ని
స్తంద్రుండై రథమెక్కి వచ్చినను రాధాసూతి కాధారణన్
సాంద్రంబై తగు నాత్మ మాయవలనన్ శాంతింపఁగాఁజేసి క్రీ
డిం ద్రైలోక్య విభుండు గాంచె నది కొండెం దోడ హైడింబునిన్ 256

మ॥ దురమందొక్కఁ మరుత్సుతుండె సుతులం దున్మాడెనంచున్నదిన్
దురభిప్రాయము గల్గియుండె నిపుడంధుండంచు లోహాకృతిన్
హరిదెప్పించి తదగ్రమం దునుపఁగా నాలింగనం బాచరిం
చె రుషన్ భీముఁడు గామిఁ దెల్పి నిరసించెం దన్మృషా దుఃఖమున్॥ 257

## ధర్మరాజ పట్టాభిషేకాదిప్రశంస.

శా॥ ఈరీతిన్ ధరణీభరంబుడిపి శ్రీకృష్ణుండు ధర్మాత్మజుం
బౌరుల్ వృద్ధులు గాంచుచుండ సభలోఁ బట్టాభిషిక్తుండుగాఁ
గారుణ్యంబునఁ జేసి మెప్పగని గంగాపుత్రి మాహాత్మ్య మెం
తో రూఢంబుగఁ దెల్పి పాండవుల సంతోషింపఁగాఁ జేయుచున్॥ 258

## భీష్మసంరక్షణము.

మ॥ స్థవిరుండయ్యు యువోపమానముగ యుద్ధంబుద్ధతిం జేసి రా
జవరుల్ మెచ్చఁగ నంపసెజ్జపయి నిచ్చన్ భీష్ముఁడుండంగ స
ర్వవిధాయాసము లంటకుండ నతనిన్ రక్షించి కృష్ణుండు ధ
ర్మవిధుల్ ధర్మజుఁ డర్మిలిన్ వినునటుల్ మైకొల్పెఁ దత్సన్నిధిన్॥ 259

## పరీక్షిద్రక్షణము.

శా॥ అశ్వత్థా మనశించెనంచు ననృతం బాడించి కుంభోద్భవున్
శశ్వద్ధామునిఁ ద్రుంపఁ బంచె నతిసాక్షాదంతకాకారుఁడై
యశ్వత్థామ కులం బపాండవము సేయంబూని వృద్ధాదిగా
శిశ్వంతంబుగఁ జెందుచుండ హరిరక్షించెం బరీక్షిత్తునిన్॥ 260

## విద్యారహస్యోపదేశాది ప్రశంస.

సీ॥ హరిధర్మరాజ పట్టాభిషే కానంతరమ్మునఁ గొన్ని దినమ్ములుండి

తదనుజ్ఞనొంది యింద్రప్రస్థపురమున కింద్రనందనుఁడు దా నేగి యచట
నిష్టవిహార సంతుష్టులు ఖండన హిండన కథన ప్రహృష్టులునయి
మయ వినిర్మిత రత్నమయ సునిర్మల భర్మమయ విచిత్రిత సభామంటపమునఁ
గూరుచుండినపుడు ద్వారకాజిగమిష ననిమిషేంద్ర సుతున కచ్యుతుండు
దెలిపి యతఁడు గోరఁ దెలిపె విద్యాగహ్వరంబు విదుఁడు తద్రహస్య మిపుడు॥ 261

సీ॥ జ్ఞాన స్థిరత్వ బీజంబైన శ్లేష్మాది యోగస్వరూప నిరూపణంబుఁ
దత్త్వజ్ఞతా విశేషతోష్ణ దేశమంత త్యాగ మింద్రియాత్మ ప్రసంగ
మోపి జీవాత్మ స్వరూప నిరూపక గురుశిష్య జనక భూసుర కథా యు
గము మనోబుద్ధ్యహంకారాది తత్త్వప్రకార మవ్యక్త ప్రకార మవల
సత్త్వగుణ మవస్యం బను స్థానయోగ్యమగుటయు సవిస్తరంబుగా నర్జునునకుఁ
దెలిపి శ్రీకృష్ణుఁ డతని హస్తిపురికిఁ జెచ్చి మరలివచ్చి యుదంకాశ్రమంబుఁ జొచ్చె॥ 262

## శ్రీకృష్ణోదంక సంవాదము.

ఉ॥ చొచ్చిన నయ్యుదంకముని సూక్తులు గన్పడ సత్కరించుచున్
మెచ్చినయట్లు భారత సమిత్పరితం బపు డుచ్చరింపగాఁ
దచ్చతురోక్తికిం దగువిధంబున నుత్తరమిచ్చి యచ్యుతుం
డుచ్చతరంబుగా మరల నున్న తెఱంగెఱిఁగింప నిట్లనెన్॥ 263

ఉ॥ ఏను గురుండు భీష్ముఁడు ననేక మునీంద్రులు నొక్కి చెప్పినన్
వీనులఁ బెట్టఁ డయ్యెఁ గురువీరుఁడు వీఱిఁడియై సబాంధవుం
డై నశియించె ధర్మపరులై జయమొందిరి ధర్మజాదులో
నా నెటువంటి వారలకు నట్లతిలోభము లాభకారియే॥ 264

చ॥ అనవుడు నయ్యుదంకుఁడు క్రుధంకుర భూతకరాత్ముఁడై శపిం
తునని తదంకముల్గనక దోషివి నీవతి పక్షపాతివై
తనుచును సంధిఁగూర్పవయితంచును దానికిఁ బూచితంబిదే
యనుచును నల్కఁ బల్క విని యచ్యుతుఁ డుల్కక పల్కె నీక్రియన్॥ 265

చ॥ తపమున కంతరాయమును దాపసహేయము నైన తామసం
బిపుడిటు సూపి తేటికిహిహీ కుపితాత్ము లొనర్చునట్టి దు
స్తపముల బీరువోదునె నిజస్థితిఁ దెల్పెద నాలకించి యం
తప్పలు మదిం దలంచిన విధం బొనరింతువుగాక భార్గవా॥ 266

సీ॥ దేవాంశ భవులఁ గౌంతేయులఁ గల్యంశభవులు దుర్యోధన ప్రభృతులహహ
సహజ వైరముగల్గి శైశవం బాదిగాఁ బడరానిబాధల పాలుఁజేసి
రనధికారికి రాజ్యమర్పించి తనభుజా బలమున బహురాజ్యముల గడించె
నట్టి తమ్మునిపుత్త్రుఁడని ధర్మమున ధర్మసూనుని యువరాజుగా నొనర్చె
జనకుఁడని వారికల్మికి సైఁపలేక। కైతవ ద్యూతమున వారి కలిమి బలిమి
నొడిసి పాలైన నిడెనె దుర్యోధనుండు। వానికంటెను దులువ లెందైనఁ గలరె॥ 267

మ॥ సభకున్ ద్రౌపది నీడ్చితెచ్చి యకటా సభ్యుల్ వినన్ దుర్వచో
విభవం బేర్పడ మానభంగమునకై విప్పించెఁ దద్వస్త్రముల్
శుభవృత్తంబు సతీత్వ మత్తరుణిఁ దచ్ఛోకాబ్ధి దాఁటించె నా
టి భృశాఘాగ్నియె ధార్తరాష్ట్ర వనవాటిం గాల్పఁగాఁ జాలదే॥ 268

మ॥ కపటద్యూతమునం జయింపఁబడి తత్కౌంతేయు లెంతేనియుం
గృపణత్వంబున నున్నవారనుచు వారిన్ నవ్వ రారాజు మి
త్త్ర పరీతుండయి ఘోషయాత్రజని గంధర్వుల్దనుం గట్టఁగాఁ
గృపచే మున్విడిపించుకైనఁ గననే హీనుల్ గృతఘ్నుల్ గదా॥ 269

శా॥ గాంగేయాదు లెఱింగిచెప్పినను శంకాపంక నిర్మగ్నుఁడై
యంగీకారము లేక కౌరవవిభుం డజ్ఞాత వాసంబునన్
భంగం బింతయు లేమి ధర్మసుతుఁడే పల్కంగ నాలించియున్
భంగం బాహవ రంగమం దెనసియుం బైకొన్నఁ జేటబ్బదే॥ 270

సీ॥ పాండవులెన్న బన్రెండు వత్సరములు వనవాస మజ్ఞాత వాసమొక్క
యేఁడును గావించు నెడఁ బొడమినవారి యిడుమలు గడువులు నుడువనేల
ధర్మపరుల్ వారు ధర్మంబెచటనుండు నచట జయంబుండు నట్టిధర్మ
మే నేను భూభార మెడలింప నవతరించినవాఁడనని మును వినఁగలేదె
నేను లేనిది నేనుగానిదియుఁ గలదె। ధర్మపరులు జయించి రధర్మపరులు
చచ్చి స్వర్గస్థులైరిది సత్యమింక। నే మనంగలవదియును మీ వుదంక॥ 271

ఉదంక ప్రార్థనము.

ఉ॥ నావుడు వాసుదేవుఁడు వినంగ ననంగ పితాపితామహ
గ్రావభిదాదికామరపరంపరకైన నెఱుంగరాదు నీ
భావము నీప్రభావమిఁకఁ బామరు లెట్టు లెఱుంగనేర్తురో
దేవ యెఱుంగ కాడితి మదీయ దురుక్తులు సైచి కావవే॥ 272

## ఉదంక ప్రార్థనాంగీకారము, (విశ్వరూప ప్రదర్శనము.)

చ॥ అనుచు నమస్కరించుచుఁ గృతాంజలియై ఖలభంజనా, జనా
ర్దన శరణార్థినై యిపుడు ప్రార్థన సేయుదు నీయుదగ్రతం
దనరిన విశ్వరూపముఁ గనంబడఁ జేసి కృతార్థుఁ జేయవే
యన నటులై కనంబడిన నచ్యుతు నాతఁడు మెచ్చె నీక్రియన్॥ 273

## గోపాలకృష్ణలీలావతార రూపస్తవము.

సీ॥ చిత్తజాతునిఁ గన్న మత్తకాశిని బత్తి జొత్తిలి యొకయడుగొత్తుచుండ
విత్తవతీ యశోవిత్తయా బిత్తరిపొత్తుమై నాకపదంబొత్తుచుండ
నుత్తుంగ రుచు లిగురొత్త హస్తములు కట్యుత్తమాంగస్థలుల్ హత్తివెలయఁ
దత్తత్సువర్ణసంపత్తికై ప్రజలుప్రపత్తిమైఁ గేల్గనలెత్తిమ్రొక్క
మెత్తనగుపాపరామెత్తనొత్తగిలఁగ। నత్తమిలిబత్తులకునెల్లబుత్తిమొత్త
లిత్తువఁటక్రొత్తయే యిట్టివృత్తినీకు। భక్తపాలనతృష్ణగోపాలకృష్ణ॥ 274

సీ॥ రంగుమెఱుంగుహొరంగుదుటంగలింపఁ గుఱంగటమెలంగి తగఁజెలంగు
నల యనంగుని తుంగమగుతురంగముతెఱంగు నెఱుంగఁజేయు భంగులుతరంగ
మాలనంగముప్పొంగ ముంగటఁ జెంగటఁ జెంగుచెంగునదాఁటుచుం గరంబు
నంతరంగంబునంతంతఁ గరఁగించు మాయాకురంగంబుచాయఁజూచి
జాయసూచింపయాచింపసాయకమున। నేయఁబూనినతొంటి నీచాయఁగంటి
నూటిగానిచ్చమిఱ నిచ్చోటనౌర। భక్తపాలనతృష్ణ గోపాలకృష్ణ॥ 275

సీ॥ పలువన్నియలతిన్నియలచిన్నియలచెన్నుఁ గన్నతిన్నని పిన్నపొన్నగున్న
కొన నున్న నిన్నన్నుకొన్నప్రీడను వేడుచున్న ప్రేయస్సులమిన్నలజిగి
నున్న నున్నని చిన్ని చన్నులుమున్నగు గొన్నిక్రొన్ననవిల్తు పెన్నిధాన
ములపొన్నికలు కన్నులలరఁ గన్గొనుచున్న నీ యల్లగొల్లకన్నియలవల్వ
లన్నియును గొల్లఁ గొన్నతెన్నన్నయట్లు। మున్నువిన్నది నేఁడిందుఁగన్నయదియు న
భిన్నగతినున్నవిట్టి నిన్నెన్నఁదరమె। భక్తపాలన తృష్ణ గోపాలకృష్ణ॥ 276

సీ॥ పట్టిసత్రాజిత్తుపట్టి రట్టునకొడిగట్టి గట్టిగఁ బుట్టినట్టికినట్ట
రెట్టింపఁ దలగట్టియిట్టిట్టనఁగరాని బిట్టుగ నలపాదిబట్టినట్టి
పట్టున నెట్టనఁ దొట్టినదట్టంపువలరాచ వెట్టచూపట్టివలపు

రేపెట్టఁ జేపట్టి రాపెట్టు వాపెట్టినట్టివేల్పులఁ గొట్టి జెట్టితనము
దిట్టతనముట్టిపడ బిట్టుఁ జెట్టఁబట్టి। చెచ్చెరఁగఁ దెచ్చియిచ్చ నచ్చెల్వకిచ్చి
నట్టినీలీలనేఁడు గన్నట్టినార। భక్తపాలన త్రుష్ణ గోపాలకృష్ణ। 277

ము॥ క్షణమాత్రంబున వత్సలుండగు రమాకాంతుండు వత్సాసుర
క్షణనవ్యాప్తయశస్కుఁడై వెలయు టాశ్చర్యంబె వత్సాసుర
క్షణనవ్యాప్తయశస్కుఁ డస్త్రబకవృత్తుంబైన కాంతారసూ
క్షణమాత్మీయ యశంబుచే ననఘుపుష్పంబౌనటుల్ సేసెఁ గాక॥ 278

సీ॥ గజరక్షణక్రియా కలితమానసుఁ డయ్యు గజశిక్షణక్రియాకలితుఁ డయ్యె
నర్జునరంజనాయత్తచిత్తుం డయ్యు నర్జునభంజనాయత్తుఁ డయ్యెఁ
బూతనామగుణాభిపూజితుం డయ్యును బూతనామరణాభిపూజ్యుఁ డయ్యె
ధేనుకాన్విత వస్త్రదాన దీక్షుం డయ్యు ధేనుకాపింతకృత దీక్షుఁ డయ్యె
నఘవిదారణచాతురి నమరువాని। కఘవిదారణచాతురి నమరు టెంత
యజగరగళాధికారియై యలరువాని। కజగరగళాధికారిత్వమిదియగున॥ 279

క॥ అచరఁబగు డెందంబునఁ। బ్రచురంబగు చందమున సభక్తిశ్రద్ధో
పచితముగ నుచితచేతో।వచనముల నుతించిమఱియుఁ బ్రార్థించెహరిన్॥ 280

## దండకము.

శ్రీమజ్జగజ్జాల జేగీయమానాగ్రజ గ్రామణిగ్రామ జిహ్వాగ్రజాగ్రత్సమగ్రశ్రుతి శ్రేణికారూప నిశ్శ్రేణికామూల కీలాయమానక్రియోపాస్తిబోధక్రమ ప్రాప్యదేదీప్యమాన స్వతస్సిద్ధతత్త్వప్రతీకాక్షరాకార లీలాలసచ్చంద్రశాలాసమావిష్టసృష్ట్యాదిబుష్యంత మాత్రాకలాపాగ్రపర్వాయిత బ్రహ్మతారాంత సంచారధీరా సుధీ రాజిరక్షా మహోత్కృష్ట కృష్ణా కృపాలంకరిష్ణుండవై విశ్వరూపంబుఁ జూపింపఁ గన్నారఁగన్గాంటి నేనేకదా ధన్యమూర్ధన్యుఁ డంగానిచోఁ బూని చోద్యంబు హృద్యంబు నిత్యానవద్యంబు వాగీశ యోగీశ భోగీశ ముఖ్యాత్మ తత్త్వజ్ఞ శశ్వద్దురాపంబు నీ విశ్వరూపంబు దాని న్నిదానించి దర్శించు భాగ్యంబు భోగ్యంబుగా నిందునాకబ్బునే ప్రబ్బునే, యిట్టి నేత్రోత్సవం బేరికిం గోరి కించిన్నిమిత్తంబుగా నంబకుం దండ్రి కాపై యశోదామహాదేవికిన్ దేవతామాని కంధావనీజానికిం గ్రీడికిన్ విశ్వరూపంబు వేర్వేఱఁ జూపించితీ విన్నిరూపంబులం జూపినా విప్పుడీచొప్పునన్ నాకిదిట్లుండ గోలోకమందుండి భూలోకముం జెందిన బాల్యాదిగా నేటిపర్యంతమున్ బర్వునీసర్వ

చర్యల్ మహాశ్చర్యములైనవెల్లం దయంజూపి నావిత్తటిన్ మోహవారాశి నే ను
త్తరింతుం బ్రసాదింపు మీ దివ్యచిద్రూప సందర్శనం బెన్నఁడున్ వెన్నుఁ డుండుం
బ్రసన్నప్రపన్నాంతరంగంబులందుండ్రు, తండ్రీ తదంకం బుదంచుండు నానుండు
నాపట్ల సందీపితంబై సపంచాయుధంబై సపీతాంబరంబై సభూషావిశేషంబులై భ
వ్యమైనట్టి నీదివ్యరూపంబుఁ జూపట్టఁగా నన్నుఁ జేపట్టి ప్రాపై కటాక్షింపు మీపై
సమీపైకదేశంబునం జేర్పుమా పై మహాదేవకృష్ణా నమస్తే నమస్తే నమస్తే నమః॥

దివ్యరూప ప్రదర్శనము-

సీ॥ మందార కుందారవిందారి సందీప్త సుందరామంద రుఙ్మందిరఘణి
మణిగణఘృణ్యాస్తరణ విస్తృతాహిశయ్యాశయానుండు నానాశమీన
సంస్తూయమానుండు శంఖచక్ర గదాజమానుఁ డబ్జవిభాసమానభాస
మానుఁ డబ్జవిరాజమాన కరశ్రీకమానినీసేవ్యమానుఁ డనుప
మానమానాతిగానుకంపా రసలస। మానుఁ డస్వప్నజేగీయమానుఁ డుయజ
మానధాత్రిజ్య మానుండు మానిపూజ్య। మానుఁడును నాచనత్తార్క్ష్యయానుఁ డపుడు॥

సీ॥ పరమహర్షోత్కర్ష పరిఫుల్లనేత్రు లవ్యాహతస్నేహ పూర్ణాంతరంగు
లగు సనకాది మహాసిద్ధజనులచే మాటిమాటికి వీక్ష్యమానుఁ డగుచు
నత్యనురక్తు లనన్యచిత్తులు నిత్యులు ననాతురులు దివ్యలోకవాసు
లైనమానులచేత నభివర్ణ్యమానుండు ఘనకనత్కనక శోభనవిభా వి
భాసమాన స్వపార్శ్వస్థ పద్మవాసి। నీనిరంతరపరిసేవ్యమానుఁ డగుచు
నీలజీమూతమధ్యస్థ నిభృతవిద్యు। దుపమితద్యుతి వ్యాద్యతరోర్వరాప
రీతుఁడై ప్రీతిసాక్షాత్కరించె నపుడు॥ 283

గీ॥ సరసిజాక్షుఁ డిట్లు సాక్షాత్కరింపఁ। బూనదివినుండి పువ్వులవాన గురిసెఁ
బాళకాహళదోహలలీలనొందె। దివ్యదుందుభిబృందంబు దివిని మొరసె॥ 284

గీ॥ తత్క్షణ తదీక్షణప్రభూత ప్రభూత। ముద్రసముద్రమున బిట్టుమున్గిమౌని
భవ్యతరనవ్య కర్తవ్యపదవిలేక। బాఢతరమూఢతాలీఢభావుఁ డౌచు॥ 285

ఆనందోన్మాదము.

ధాత్రీవృత్తము॥ మరలఁ గూరుచుండు నుండి మౌనమొందు నొంది త
త్పరత నాడు నాడి పాడు పాడి వేడు వేడి వి
స్ఫురణ మ్రోయు మ్రోసి చూచుఁ జూచి లేచు లేచి య
స్థిరగతిం బ్రదక్షిణంబుఁ జేయుఁ జేసి కుయ్యిడున్॥ 286

ఉ॥ ఈయ్యెడి నవ్వు నవ్వి మఱి గొబ్బున హారముఁ బాఱుఁ బాఱి తాఁ
జయ్యన వచ్చు వచ్చి కటిసామిని వేమఱు ముట్టు ముట్టి మే
నొయ్యనఁ బట్టుఁ బట్టి కడు నుక్కున నక్కునఁ జేర్చుఁ జేర్చి బల్
నెయ్యము నించు నించి కరుణింపు మటంచు వచించి మూర్కొనున్॥ 287

సీ॥ మూర్కొని పేర్కొనుఁ బేర్కొని వలఁగొను వలగొని తత్పాదములకు మ్రొక్కు
మ్రొక్కి చెక్కిలి నొక్కు నొక్కి ముద్దాడు ముద్దాడి యాస్వాదించు నాస్వదించి
మరిపెంపు విరిజొంపముల నింపు మెయి నింపు నింపి కంపితవృత్తి నిల్చు నిల్చి
ప్రలపించుఁ బ్రలపించి రహి విహ్వలతఁ జెందుఁ జెంది బిట్టురవంబుఁ జేయు నిట్లు
చపలచేష్టలఁ గ్రీడించి సందడించి। పనుల సడ్డించి మద మెదని నుమడించి
తద్గుణము లుగ్గడించి మాంద్యంబుడించి। కరము మదిఁ బ్రేముడించి కేల్గవ మూడించి॥

గీ॥ చిత్తమాయత్తముగఁ జేసి చిద్విలాసి। యైన వైకుంఠపురవాసి నవుదుడాసి
తమము నెడఁబాసి క్లేశ పాశములఁ గోసి। నిజముఁ దలపోసి నిజమనోరుజకురోసి॥

క॥ అక్షీణంబగు భక్తిను। పేక్షింపక నమృత రస మపేక్షించి కృపన్
రక్షింపనున్న జలజా। క్షాతు నిటుల్ప్రొగడఁ దొడఁగె నతఁడానతుఁడై॥ 290

చ॥ కరముఁ బ్రసన్నచిత్తుఁ డవు గమ్ము జగమ్ముల చిత్తవాగగో
చరుఁ డగు నీవ యీవరుస జాగ్రదనుగ్రహ విగ్రహుండవై
యరుదుగ దృష్టిగోచరుఁడవైతివిగానఁ బ్రభావితుండనై
పరఁగినవాఁడ నేఁడఖిలభక్త జనార్తిహరా రమేశ్వరా॥ 291

చ॥ అణువునకన్న నత్యణువనంతుఁ డచింత్యుఁడు కారణైక కా
రణము మహత్తరుండును బరాత్పరుఁ డక్షరుఁడు న్నిరీశుఁడుం
బ్రణవమయుం డనామయుఁడు భవ్యుఁ డపవ్యయుఁ డీశుఁ డిమ్మహా
ఘృణుఁడని సూపె నిన్నెదల నెన్నెద రెన్నఁడు నెల్లకోవిదుల్॥ 292

గీ॥ అగ్ని సంతప్తమైన లోహంబువలన। విస్ఫులింగోత్కరంబెట్లు విస్ఫురించు
నట్లు సత్త్వరజస్తమో వ్యాప్తమగుచు। నీవలన జీవవర్గంబు నిర్గమించు॥ 293

గీ॥ కనఁగ వినఁగఁ జనఁగఁ గడువఁగ నుడువఁగఁ। గైకొనంగ మదిని మైకొనంగఁ
దరముగాదు నీదు తత్త్వంబు నీమహ। త్వంబు జగదతీత నంబుజాక్ష॥ 294

మ॥ అంబుజనాభ యీ భవ దనాగ్రహ విగ్రహ మూర్తులాడఁ జా

డం బరమర్షి బృందము దృఢంబుగ హర్షముఁ గ్రమ్మ బ్రహ్మచ
ర్యంబొనర్చు మౌని నికరంబు కరంబుఁ దపంబొనర్చు జ
న్నంబు లొనర్చు నధ్వరిజనంబు కృతంబుఁ ద్వదర్పితంబుగన్॥ 295

చ॥ అనశనులై మహీశయనులై మునులై వసుధాసుధాశనుల్
నినుఁ గనుఁగొంట కొంటిమయి నిల్చుచు వేల్చుచు రర్థితీర్థసే
వన మొనరింతు రెంతయు సువాసిత గంధ సుమాదులం బ్రమో
ద నిలయులై భజింత్రు సతతంబు వ్రతంబు లతంద్రితంబుగన్॥ 296

క॥ సతులపయిన్ సుతులపయిన్। హితులపయిన్ రతులువీడి యూడితమతులై
యతులు భజింతురు నిన్నా। నతుల నుతుల నతుల గతుల నయ వినయములన్॥ 297

ఉ॥ నీరుషులై మహాఋషు లనిస్పృహతాది హితాత్ములౌచు గం
భీరు షడూర్మి దూరు షడభిజ్ఞముఖాజ్ఞను దన్మనోజ్ఞ సం
చారు షడాననాది సురసన్నుతు నిన్ను మహా మహున్ మహా
పూరుషుఁ గొల్తు రుగ్రతపము ల్జపము ల్మొదలైన చైవులన్॥ 298

శా॥ మధ్యేదుగ్ధ మహాబ్ధిశాయి రవిబింబస్థాయి నారాధ్య శు
ద్ధధ్యానప్రతిబోధ్యుని న్గొలుతు రిద్ధశ్రద్ధఁ బృథ్వీసురుల్
స్వాధ్యాయాధ్యగ సాధ్వగారగ సపర్యాధ్యాత్మ చర్యాయథా
విధ్యాగబ్ధ మహాధ్వర ప్రపదనావిర్భావ భావంబులన్॥ 299

క॥ క్రమతను దయామయాత్మ్యయ। సముదయ సముదగ్ర దుఃఖ సముదాయము దాఁ
టి మహావిచక్షణుఁడు మోక్షముఁ జెందున పేక్షు నిన్నే శరణంబొందున్॥ 300

చ॥ బహువిధ పూర్వజన్మ కృతపాప కలాప విలేప వాసనా
మహదవిలేపమత్తము ప్రమత్తము చిత్తమదెన్నఁ డైన స
న్నిహితము గాదు నీదరి నణిష్ఠ దురిష్ఠ నికృష్ఠమున్ మహు
ద్గృహ విషయాపకృష్టమను దృష్టము హృష్టమునొంచుఁ గ్రమ్మరన్॥ 301

ఉ॥ నేర్పదలిర్పనూర్పు గమి నెమ్మినెదం గుదియించి హృత్సమా
త్సర్పితదర్పకాని రిపుదర్పులు యోగ సమర్పితాత్మ సం
తర్పకులైన వారికిఁ గనంబడకుండియు నాపయిం బ్రియం
చేర్పడఁగాఁ గనంబడితి వీ వతివేగము భక్తవత్సలా॥ 302

ఉ॥ ఫుల్లసముల్లసత్కమల భూతి విమోచన లోచనా జగ

ద్వల్లభ దుర్లభంబయిన తావకసన్నిధికన్న …
నెల్లపుడొల్ల నుల్లమున నిత్తఱిఁ ద్వత్పదు … 
జల్లఁగఁ జల్ల నా సుకృతసస్య మవశ్యము పండె … 303
ఉ॥ నీవ గురుండ వీవ జననీ జనకాప్త జనంబుగా …
తావకపాద భక్తియును దావకదివ్యకథానురక్తియుం
దావక దర్శనైక రసతాభృతిఁ దావకనామ కీర్తనో
చ్చావచ వాక్పమత్కృతిఁ బ్రసన్నమనం గటగింపు మీశ్వరా॥ 304
మ॥ అతిమాయావృతి మోహితుండనయి కృత్యాకృత్య కప్రీతహితా
హితసంప్రాప్తి నెఱుంగఁ దావక దయాదృష్టి ప్రసారప్రణ
ష్టతమో త్కృష్టతమో విమోహవృతినై సత్యంబుగా నీవ మ
ద్గతిగాంచుచు మతినెంచి నీశరణ మాత్మం గాంతు నత్యంతమున్॥ 305
చ॥ మునుపచరించినాఁడ నఘముల్ బహుళంబుగఁ బూని వానిఁ జే
రొ్కనఁగఁ దరంబుగాదు యుగకోటులనైన విహంగమేంద్ర వా
హన జగదంతరాత్మకుఁ డవౌట నెఱుంగుదు వీవ కావునన్
మనమునఁ దావకీన చరణంబుల నే శరణంబు నొందెదన్॥ 306
చ॥ అని యిటువిన్నవించి వినయంబున నాదలసోఁక సోఁకుమూఁ
క నడఁచుతేని యంఘ్రులకు గ్రక్కున సాఁగిలిమ్రొక్కి తజ్జనా
ర్దనుపదపద్మముల్ దనకరంబులఁ బట్టుచు మిన్నకున్న ని
ట్లనె సదసజ్జగత్ప్రభువుఁడైన రమాధవుఁ డాదరంబునన్॥ 307

భగవద్వాక్యావళి.

మత్తకోకిలము॥ అంబుపాశ మొనర్చుచున్ వినయంబుచే ననయంబుఁ బం
తంబునం జిరకాల మెంతయు నన్నుఁ దన్పితివీవు ధ్యా
నంబులన్ యజనంబులన్ భజనంబులన్ సుజనంబు లె
న్నం బరిక్రమణంబులన్ గమనంబులన్ నమనంబులన్॥ 308
మ॥ పరికింపంబడె నాపయింగలుగు శుంభద్భక్తిఁ గావించితౌ
చిరకాలంబు మదర్థ మాగ్రతప మీక్షేత్రంబునం దుష్టిచే
కురె నీచేసినయిష్టి నాకతన నీకున్ దర్శితంబయ్యె న
శ్వరమున్ దుర్లభమౌ మదీయ సగుణాకారంబు ధీరాగ్రణీ॥ 309
గీ॥ జపతపోహోమదాన యజ్ఞములనైన। జడమతులకేను దృష్టిగోచరుఁడఁగాను

బ్రహ్మాదులు జిహ్వయా భక్తిచేత। నన్నుదర్శింపఁ గలరు ప్రపన్నులగుచు 310

క॥ కలుగవు నాకొక్కపుడు। న్దలఁచినచోఁ గార్యకారణములు జగములం
గలిగించుట వెలిఁగించుట। నలఁగించుట కౌతుకంబుగా దే యెపుడున్॥ 311

శా॥ ప్రజ్ఞావిగ్రహుఁడం బ్రపంచమయుఁడం బ్రాజ్ఞప్రియుండం బ్రపూ
ర్ణజ్ఞానాఢ్యుఁడ యజ్ఞరూపకుఁడ సర్వజ్ఞుండ గీర్వాణ దు
ర్విజ్ఞేయుండ నమేయ వైభవుఁడనై వెల్గొంది రామానుజా
భిజ్ఞంబూనితి నజ్ఞులం దునిమితిం విజ్ఞుల్ మనం బ్రోఁచితిన్॥ 312

క॥ ఘనము రహస్యము విస్మయ। జనకమునగు నస్మదీయ సచ్చరితము వ్రా
సిన వినినఁ గనినఁ జదివిన। జనుఁడు మదీయుండు ధన్యజనమూర్ధన్యా॥ 313

## శ్రీ ద్వారకాపుర ప్రవేశము.

వ॥ అని యిట్లత్యంతాగణ్య కారుణ్య సద్మ స్వాంతుండగు నప్పద్మా కాంతుం డచ్ఛస్వాత్మరంగుండై ముఖపద్మాంతరంబునం జిఱునగ వెసంగఁ బ్రసంగవశంబున మృదుమధుర వచనరచనల నానతిచ్చిన వానతోచ్చయావన ప్రవణ భాషణంబులు శ్రవణ భూషణంబులుగా విని వినిర్మల గుణగణాంకుండగు నయ్యుద్ధవుండు హృదంతర దంతుర సంతోష రసాక్రాంతుండై యభివదించి యుదంచిత భక్తిం బ్రయుక్తాంజలి బంధుండై యాదీనబంధుండు విన నవినయానుబంధంబుగ వినుతించుచు నెడసేయరాని ప్రేముడి నుదుశిరోమణి రామణీయక భూషణధురంధర పురందర శిలాకలాప కలాప లపన నిపుణ లపన వపుః ప్రభాపరంపరా పరాజిత రాజత శరదబ్జ శరదుండగు నవ్వరదుని వదనారవిందం బానంద బిందు బృందం బమందంబుగాఁ గనుంగొనలఁ జెన్నంగొనం గనుంగొనుచు మనంబునం బునః పునః ప్రదక్షిణంబులఁ గ్రమంబుగా నొనరించుచు నమస్కరించుచున్న యవసరంబునం బ్రభవిష్ణుండగు విష్ణుండు నిష్కళంక నిరాతంక దయాలంకరిష్ణుండై శ్రీకృష్ణుండు తదిష్టవరంబులొసంగి తదనుమతిం బయనంబై సైన్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకంబులను వాహనంబులంబూన్చి గరుడధ్వజంబమర్చి దారకుండు శతానంద రథంబాయితంబుచేసిన నధిరోహించి సపరివారంబుగాఁ జనిచని పశ్చిమ సముద్రంబను దర్పణంబునం బ్రతిబింబించిన పృథివీమండలంబునుంబోలె వెలయుచు ద్వాదశయోజన విస్తీర్ణ పుణ్యస్థానంబై సర్వర్తుసమయ పల్లవిత పుష్పిత ఫలిత లలిత కుంద మందార చందన పిచుమంద సాల రసాల తాల తమాల కృతమాల మాలతీ పనస ఘనసార కదళీ నారికేళ పూగ పున్నాగ నాగవల్లీ ప్రముఖ నిఖిలతరు కుంజ రంజిత

లతా వితానైక తానంబులగు నుపవన ప్రతానంబులును శుకపికశారికా మయూర పారావతాది ద్విజకుల కలరవ సంకులంబులగు మణిమయక్రీడాచలంబులును; బక మరాళ కారండవ కైరవ నీరజ కోకనద కహ్లార హల్లక తల్లజ చంచరీక సంచయ సంచారంబులగు కాసారంబులును; శచీప చాప రూప దీపిత కారణంబులగు తోరణంబులును; సప్తసప్తిసంచార నిరోధక శిఖరసుందరంబులగు సప్తభూమికా మందిరంబులును, నిరంతర యాతాయాత గో గోపికా గోపాలకాది సమ్మర్ద నిసర్గంబులగు రాజమార్గంబులును; నిస్తుల ప్రశస్త సమస్తవస్తు సంపత్సంపూర్ణ గౌరవాధికలగు పణ్యవీథికలును; రంగచ్ఛృంగాంగ మాతంగ తురంగ భటపుంగవ నిరంతర సంచార చమత్కార సందర్శన సానంద గతాగత పౌర జానపద సమాకీర్ణంబులగు పురాభ్యర్ణంబులును గలిగి వెలుఁగొందుచు నిష్కంప సంపద్ద్వారవతియనం బ్రసిద్ధిగన్న ద్వారవతిం బ్రవేశించి పురజనచకోరానీకంబులకు సాంద్రతర చంద్రికోదయ సదనరాకయగు దనరాకకెదురు చూచుచుఁ దనుం బొడగని యనుముగని తలంపున నెగడుచుం బొగడుచు; జనులెల్ల మెల్లనఁ దనవెంబడి నడువ నగరనివాసినులగు సువాసినులు గొందఱు సుందరతరచంద్రశిలా సాంద్ర చంద్రశాలా విశాల వాతాయన వ్రాతంబుల ననుసరించి ముక్తాఫల కుసుమ లాజ విసరంబులు సరవిమై సరసంబుగ విసరుచున్న యవసరంబున శంఖద్గంభీర భూరి పరిఖాంబుధి ప్రతిబింబిత స్వర్గంబగు దుర్గంబు సేరంజని సంజనిత కుతూహలంబునఁ గాహళపణవ పటహ దుందుభి ప్రముఖ నిఖిల హృద్యమంగళ వాద్యముఖరిత దిగంతంబులగు ననేక కక్ష్యాంతరంబులుగడచి యేనుంగుమొగసాలంగని యరదంబు దిగి జననీజనకపుత్త్రమిత్త్ర కళత్త్రాది జనంబులు ముదంబున నెదుర్కొనిన వేర్కొనుచు వారల నందఱ నయ్యైతెఱంగుల సంభావించుచుఁ బ్రద్యుమ్నానిరుద్ధుల కరంబులుగొని కరంబుఁదనరాక కలంకృతంబై గురు బుధ కవి మిత్ర జైవాతృక సూర్యాత్మజాది నానామర్త్య కదంబ సంఘాసమానంబై సుధర్మంబోలియు నిత్యముక్తాలంకృతంబై వైకుంఠపురింబోలియు సర్వమంగళాస్పద రాజశేఖర విరాజమానంబై రాజతాచలంబునుంబోలియు మిగులఁ జెల్వొందుచున్న కొల్వుకూటంబునకుం జని కిరీటకుండల హారకేయూర నిస్తులకౌస్తుభ వనమాలికా వలయాంగుళీయకాది దివ్యాభరణ భూషితుండై పీతాంబరధరుండై తద్దయు నుద్దియుడగాని సింగపుగద్దియపై ముద్దియలు సేయ నూడిగంబు లంగీకరించుచు సొంపుమై నింపొందుచు భక్తపరిపాలనం బొనరించుచుఁ గృతకృత్యుండై శ్రీకృష్ణుండు సుఖంబున నుండెనని శ్రీ కృష్ణాభ్యుదయంబు సవిస్తరంబుగా సంగ్రహించి ప్రసంగించి మఱియును॥ 314

క॥ దక్షిణు లరిశిక్షణులు వి। చక్షణులు సువీక్షణులు రసక్షణులు జగ
ద్రక్షణులు క్షణక్షణశుభ। లక్షణులగు రామకృష్ణులను సేవింతున్॥

సీ॥ జయ జలజాతాక్ష జయ దాసజనరక్ష జయ జగదధ్యక్ష సత్యదక్ష
జయ రాధికానాథ జయ సజ్జన సనాథ జయ రక్షితానాథ సరసగాథ
జయ సకలాధార జయ ధరాధరధీర జయ కారణాకార శాస్త్రసార
జయ చిత్రచారిత్ర జయ జలధరగాత్ర జయ నతాలికనేత్ర సదరిజైత్ర
జయ జనార్దన సదయనశరధిశయన। శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గహస్త
జయ నిరీశ గిరీశ కంజాతజాత। కాయజాద్యాదితేయ నికాయ గేయ॥

మ॥ జయలక్ష్మిన్ విజయప్రియుండు నిఖిలైశ్వర్యంబు లయ్యాశ్వర
ప్రియుఁ డత్యాయువు నబ్జభూజనకుఁడుం శ్రేయోగుణోద్యత్కుటుం
బ యశోవృద్ధి జగత్కుటుంబి కరుణన్ మన్నించి మీకిచ్చు న
వ్యయభక్తిన్ భజియించి దివ్యకథ లిట్లాలించి మేలొందుఁడీ॥

ఉ॥ నాకిని యీ వినిర్మల మనస్కు లనంతు ననంతచర్య లీ
రీతిని సంగ్రహించి ప్రకటించితి వెంతయు వింతయయ్యె భ
వ్యావహ మీదినంబనుచు హర్షమునొందుచు రామహర్షణిన్
వేవిధులన్ నుతించి ప్రభువిష్ణునిఁ గృష్ణునిఁ గొల్చిరందఱున్॥



## ఆశ్వాసాంతము.

మ॥ వరధీరాధికరాధికారమణ భాస్వత్పాద పద్మద్వయీ
నిరతారాధకరాధకప్రతిమ సందీప్తప్రతాపప్రథా
పరివాదాధికరాధికారసమయప్రాంచత్తటాకచ్ఛటా
భరతాగాధక గాధక ప్రణుత శుంభచ్ఛ్రీయశస్సాధకా॥

క॥ జీవనయకృత్తరిపురా। జీవనయను జీవి జీవ జీవం జీవో
జ్జీవనజైత్రాత్మక రా। జీవనయన బంధుజీవన వనదా॥

భుజంగప్రయాతము॥ ధృతిలాభృదింద్రా కుధీపద్మచంద్రా
ప్రతీపప్రథోపేంద్ర పద్మాక్షిసాంద్రా
కృతీడ్యార్థనిస్తంద్ర కీర్త్యర్ధిరుంద్రా
కృతిరాజగోపాల కృష్ణావనీంద్రా॥

## ఆశ్వాసాంతగద్యస్థానీయ పద్యము.

ఇది శ్రీవేంకటగిర్యధీశ్వరకళాభృద్రాజ గోపాలకృ। ష్ణదయామండన
మండపాకకుల భాస్వత్పార్వతీశాఖ్యమ।ద్వదనావిష్కృ
తగద్యపద్య విలసత్తత్తత్కథా సంగ్ర
హా।స్పదకృష్ణాభ్యుదయంబు సర్వ
మొక యాశ్వాసంబుగా
భాసిలుఁ॥

❊❊
❊

త్రికకుత్త్ర్యం
బక భక్తియుక్చతురశీతి
గ్రంథకృన్మండపా।క కులప్రోద్భ
వపార్వతీశ్వరసమాఖ్యక్ష్మాసురా।గ్రేసరా।ర్భ
కుఁడై భాసిలుచున్న కామకవితత్పాదాబ్జముల్గొల్చివా।
రక కృష్ణాభ్యుదయంబువ్రాసెఁదదభిప్రాయానుసారంబుగాఁ॥

స్వస్త్యస్తు.

సంపూర్ణము.

విభాగ సంఖ్య ..........



## శ్రీ మండపాక పార్వతీశ్వరకవీశ్వరప్రభావవర్ణనము.

క॥ శ్రీమత్పూండ్లకులాంబుధి- సోమా సోమహరిపాదశుభవనజాళీ- నామేయ మనోభృంగల- లామా శ్రీరామకృష్ణ లలితసునామా॥ తే.గీ॥ పండితోత్తమవినుమ శ్రీమండపాక - పార్వతీంద్రకవీంద్ర ప్రభావమెలమి - నెంచిపద్యముల్ రచియించి పంచినాఁడఁ। గానఁ బ్రకటింపుమిది పత్రికాముఖమున॥ సీ॥పంచపాది॥ శ్రీకరేందుమతీపరిణయాదికృతికర్తయగు మండపాక పేరయమనుమఁడు - బలరామసుక్షేత్రవిలసన్మహాత్మ్యాదికర్తయౌ మకాసత్కవితనయుఁడు - స్ఫురదవధూతాను భూతిగీతాదికకర్త రామస్వామికవికనుజుఁడు - సత్పంచదేవతాస్తవముఖకృతికర్తయైన పేరయసూరి కగ్రజుండు - ఛాయారమణలసచ్ఛ్రుతకాది సత్కృతికర్తయైతగు కామకవిజనకుఁడు - ధరణిశ్రీజగదీశ్వరదండకాది - కర్తయగుపినకామ సత్కవిపితృవ్యుఁ - డమితసాహితీవైభవ దమితసుకవి - నివహుఁడలపార్వతీశ్వర కవివరుండు ॥ క॥పోఁడిమిఁ బంద్రెండేఁడుల -యీడు మొదల్కవియనంగ నెంచందగి కొ ్రవ్వాఁడి ననేక గ్రంథము-లోడక యప్పార్వతీశుఁ డొనరించెనిలన్ ॥ సీ॥ బ్రహ్మేశశతకము పరమాత్మశతకము బాలకృష్ణశతకం~~బాలకృష్ణ~~- శతములు రఘుపతిశతకము సర్వేశ్వరశతకము పార్వతీశ్వరశతకము- హరిశతమువరాహ నరసింహశతకము గణపతిరామరక్షాశతములు - రాధికాకృష్ణసంవాదప్రబంధంబు శ్రీగురుచరిత కాంచీమహత్త్వ - మమరకసుకావ్యమాదిగానమరుకృతులఁ - బేర్మి నెనుబదినాల్గు(౮౪) గావించిమించె-బండితోత్తమ నెచంగమండపాక - పార్వతీశ్వరకవిపట్టభద్రుఁడెలమి ॥ సీ॥ మునుపూర్వకవివరుల్మహితప్రబంధంబులందచ్చటచ్చటబంధకవన । మును జెప్పుటయె కాని ఘనబంధకవనలక్షణమిదియని చెప్పఁజాలరైరి । కావునఁగవులకకష్టబంధకవనరచనకష్టతరమని సరిఁదలంచి। సదయుఁడౌచుఁ "ప్రబంధసంబంధబంధనిబంధనగ్రంథముఁ" బార్వతీశ। కవిజనవరేణ్యుఁ డొనరించిభువినివర్త । మానభావికవీంద్రసంతానమునకుఁ । బ్రతిభమీఱంగమహదుపకృతియొనర్చెఁ । బండితావళికెల్లనుబ్రమదమెసఁగ ॥ సీ॥ తనగ్రంథములుపెక్కులని నశ్రీనాథుండు- బహుసంస్కృతాంధ్ర ప్రబంధములను । రచియించితినటన్న రామభూషణుఁడును- దనకృతులన్ని పేర్కొనినగణప । వరవేంకటాఖ్యుండు - స్వకృతసత్కృతిసంఖ్యవ్రాసిన నెల్లూరిరాఘవుండు।దనగ్రంథనామములనువచించినకూచి మంచితిమ్మయ్యయు-మండపాక । పార్వతీశ్వర కవిపంచవదనుఁబోలి । వరుసఁబంద్రెండు మొదలుఖువదియునేండ్ల । యీడువఱకెనుబదినాల్గుకృతులొనర్చి । ఖ్యాతిఁ జెందంగఁ జాలిరే భూతలమున ॥

ఇట్లు,

మచ్చ వేంకటకవి.

పర్లాకిమిడి. 1- 1- 98.

ఆంధ్రకవులు, తృతీయభాగానుబంధమునందు 14-15- పుటలలో

నిట్లు వ్రాయఁబడి యున్నది.

మండపాక - పార్వతీశ్వరకవి.

"ఈవిద్వత్కవి శతకములు మొదలైనవి యెనుబది గ్రంథములవఱకును రచియించినను ఈయనచేరచియింపఁబడి ముద్రింపఁబడియున్న గ్రంథములలో శ్రీరాధాకృష్ణసంవాదమను నాలుగాశ్వాసముల ప్రబంధము ప్రధానమైనదిగా నున్నది. ఈయన వైదికబ్రాహ్మణుఁడు ; పారాశరగోత్రుఁడు ; కామేశ్వర పండితపుత్త్రుఁడు. ఈకవియొక్క తండ్రితాతలుకూడ కవీశ్వరులయినట్టు రాధాకృష్ణసంవాదమునందు కవియీక్రిందిపద్యమునఁ జెప్పియున్నాఁడు—

సీ॥ శ్రీమీఱ నుభయభాషామిశ్రసత్కృతుల్ తజ్ఞులెన్న నదంకితములు చేసి
యశముఁ గాంచిన పేరయ మనీషి మణికిఁ బౌత్త్రత్వంబుఁ గార్తికవ్రతమహత్త్వ
శివమహత్త్వాద్యనేకవిధప్రబంధంబు లొనరించి సత్కవి వినుతిఁ గనిన
పారాశరగోత్ర పావనుండగు మండపాక కామేశ్వరపండితునకు
మహితపుత్త్రత్వమును గాంచి బహువిచిత్ర। చిత్త్రశతిముఖ్యసత్కృతుల్ చెప్పి మెప్ప
వడసితివిగద కులకీర్తివర్ధిలంగ। సరసగుణసాంద్ర పార్వతీశ్వర కవీంద్ర.

ఈ కవి విశాఖపట్టణమండలములోని బొబ్బిలి సంస్థానమం దాస్థానకవీశ్వరులలో నొకఁడుగా నుండినవాఁడు. ఈ పార్వతీశ్వర శాస్త్రిగారు ౧౮౩౩ వ సంవత్సరమునందు జననమొంది ౧౮౯౭ వ సంవత్సరమధ్యమున పరమపదమునొందిరి. ఈకవి సంస్కృతాంధ్రములయందు మంచిపాండిత్యముఁ గలవాఁడయి మృదుమధుర నిరర్గళధారతోఁ జతుర్విధకవిత్వమును జెప్పఁజాలుటయేకాక వినయసౌశీల్యాది గుణసంపత్తి గలవాఁడయియుండెను. పూర్వోక్తమయిన రాధాకృష్ణసంవాదము రావువారను నామాంతరముగల వెలుగోటివారనెడి గృహనామముచే వెలయు శ్రీవేంకటగిరిసంస్థానాధిపతులవంశానుక్రమము వర్ణించెడుగ్రంథము. శతకములును దండకములును గాక యీకవి విరచియించిన గ్రంథములలోఁ గాంచీపురమహత్త్వము, అమరుకకావ్యము, ప్రబంధసంబంధబంధ నిబంధన గ్రంథము, శ్రీకృష్ణాభ్యుదయము, కొంత పెద్దవి. ఇప్పుడీయనగ్రంథములలో నొక్క రాధాకృష్ణసంవాదమునుండి మాత్రము కొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను—"

❊ ❊ ❊ ❊ ❊ ❊ ❊ ❊ ❊ ❊